# విషయసూచిక.







శ్రీ

# ముక్తావళి

## మహాభారతము.

### విరాటపర్వము.

### చతుర్థాశ్వాసము.

—♦ భూమింజయుండు గోవుల విడిపింపఁ గౌరవులతోఁ బోరుటయుఁ బో నెన్నుకొనుట. ♦—

క. సూర్యోదయావసరమున
దుర్యోధను బలము ప్రబలదోర్బల లీలా
ధుర్యగతి నడచె భీష్మా
చార్య రవిసుతాది యోధ సంఘోద్భటమై. 1

వ. నడచి మత్స్యనగరంబున కనతి దూరంబున విరాటపశుగణంబులం బొదివె నట్టియెడ ముక్కఁడి మూఁకలు సని యెక్కఁడెక్కఁడ యని తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన వికర్ణ దుర్ముఖ ప్రముఖ రథిక జనంబులు గోపాల వర్గంబున నర్గళప్రసారంబగు శరాసారంబునం గప్పినం గని కౌరవబలంబగుట యెఱింగి బెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగు దెంచి రాజమందిర ద్వారంబున రథావతరణంబు సేసి యంతః

పురంబుననున్న భూమింజయుం గాంచి ససంభ్రమముగా నిట్లనియె. 2

మ. ధరణీచక్రము సంచలింపఁగ సము
ద్రాంతంబులై గ్రక్కునం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెన్
గోవర్గమున్ వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపు
క్ష్మాపాల లోకంబు నీ
శరజాలంబుల పాలుసేయుము భుజో
త్సాహంబు సంధిల్లఁగన్. 3

ఆ. తేరు పూన్పఁబంపు తెప్పింపు దృఢతను
త్రాణ ముగ్రచాప బాణపూర్ణ
తూణ ఘనగదాసితోమర చక్రాదు
లనువుగా నొనర్చు మతిరయమున. 4

చ. విరటుఁడు నిన్ను నెప్డు పది
వేవురముందర చెప్పు బాహు వి
స్ఫురితుఁడు శౌర్యశాలి కుల
భూతివిశేష విధాయకుండు భూ
భరణ విశారదుండు జన
భవ్యతపఃఫలసంభవుండుగా
తరపరి రక్షకుం డనుచు
దానికి నీడుగఁ జేయుమి త్తఱిన్. 5

క. అని కాంతాజనములలోఁ
దను నగ్గించుటయును బొంగి దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు దన మన
మున సంగరకౌతుకంబు ముడివడుచుండన్. 6

ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల
నెల్లను మూఁకొని తేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ
దేరికి సారథి లేమిఁ జేసినా
చిత్తమునన్ విచారదశ
సెందెడు నెవ్వఁడు గల్గు నొక్కనా
కిత్తఱినేఁ గదా కడప
నెంతయు నేర్తు రథంబు నాప్తురిన్. 7

క. తగు సారథి దొరకొనినం
బగతుర భంజించు టెంతపని కదుపుల దఁ
వ్వఁగఁ గొనిపోదుఁ గో, యి
ట్లగునే కలఁడేని సూతునరయుం డెందున్. 8

చ. కురుపతి భీష్మ కర్ణ కృప
కుంభజ ముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁడను
బుద్ధి గలంగఁగ బెట్టుగిట్టి సం
గరమున నొచ్చి యేఁబనులఁ
గ్రమ్మఱుఁ దేరకయున్న నన్ను భూ

వరుఁడు సుహృజ్జనంబుఁ
బరివారముఁ జిత్తములందు మెత్తురే. 9

వ. అనునప్పుడు తత్ప్రదేశంబుననునికిం జేసి. 10

క. విని ద్రుపద ధరణి పతినం
దన సామర్థ్యాపహాస తరళ హృదయయై
చని తద్వృత్తాంతము నా
తని పలుకులుఁ జెప్పె నింద్ర తనయునితోడన్; 11

వ. అతండు నజ్ఞాతవాస వత్సరంబతీతంబగుట నిరూపించి పాంచాలికిట్లనియె. నీవు పోయివారలతో నిట్లనుము. మన బృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు. దొల్లి ఖాండవ దహనంబునం బాండవ మధ్యమునకు సారథియై యతని చిత్తంబువడసె మఱియుఁ బెక్కెడలం దదీయంబగురథంబుగడపఁదానయైయుండు నేనునెఱుంగుదుం దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింపవచ్చుటకు సంశయంబువలవ దనునది. వారేమనిరేని మరియుం దగనాడి నన్నుం బిలుచునట్టి తెఱంగు గావింపు మన నట్ల చేయుదునని సైరంధ్రి యుత్తరయున్న యెడకుంబోయి. 12

చ. జనపతి నందనుండు దగు
సారథి నారయుచున్నవాఁ డెఱిం
గిన పనిసెప్పఁ గావలయుఁ
గ్రీడి మనంబున మెచ్చునట్టి నే

ర్పును భుజశక్తియుం గలిగి
సారథికి నెక్కిన సూతవృత్తిమై
ననిసఁజి సన్నుతోత్తరుఁ బృ
హన్నలకుం గల దంబుజాననా. 13

తే. అర్జునునకు ఖాండవ దహనాదులైన
విక్రమములు నా బృహన్నల వెరవులావు
గాదె జయమొనరించె లోకంబు తెలుఁగ
నువిదదీని నెఱింగింత ముత్తరునకు. 14

క. అని యమ్ముదితయుఁ దానును
జని యతనికి నర్తుఁగు సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి
ట్లనియెం బాంచాలితోడ నల్లననగుచున్. 15

తే. అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ
నేల చక్కఁగఁ గనువిచ్చి యేనుబేడిఁ
జూడరోయుదు రణమున సూతకృత్య
భరము దాల్చుటకెమ్మెయిఁ బనుచువాఁడ. 16

వ. అదియునుం గాక, 17

చ. కురుకుల మేఁగుదెంచెనఁట
గోవులబట్టుటఁ బట్టదానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు
బాహుబలంబును జూపఁబూని యే
నరిగెదనంట తేరికి బృ

హన్నల సారథియైన దీని న
వ్వారె పురిలోన నింతకఱ
వా రథచోదకుఁ డింతయేటికిన్. 18

వ. అనిన విని సైరంధ్రి యతని కిట్లనియె. 19

ఉ. కౌరవసేన గాదు త్రిజ
గంబులు నొక్కట నెత్తివచ్చినం
దేరు బృహన్నలావశగ
తిం జరియించిన గెల్వవచ్చుఁ ద
ద్వీర గుణంబుసొంపు పృథ
వీవరనందన మున్నెఱుంగుదుం
గారణజన్మమై తనువి
కారము వచ్చినఁ బెంపుదప్పునే. 20

వ. అనవుడు, 21

క. మనమురియాడుచు నుండఁగఁ
దనకోరులప్పటికి లేమి ధరణీశ్వర నం
దనుఁడు బృహన్నలఁ బిలువం
బనుచుట కోడఁబడిన పలుకు వలుకుటయుదగన్. 22

వ. సైరంధ్రిదెసఁ గనుంగొని యేనుబోయి తోడ్కొని
వచ్చెదనని పూని, 23

సీ. అడుగులనునుఁగాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కరణినొప్పఁ
బాలిండ్లు దనువెడ వ్రాలింపఁజెన్నొందు
ననదుఁగాఁ దీగ యల్లాడుచుండఁ

దఱిఁ జేచి వెనువెంటఁ దగులు కామాంధకా
　　రములీలఁ గ్రొవ్విద గొమరు మిగులఁ
గర్ణభూషణ మౌక్తిక ప్రభాడోలన
　　మీక్షణ దీప్తుల నిసుమడింప
నందియల మొరపంబున కరఁగుదెంచి
పోదిరాయంచ రయమునఁబోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమునఁ దోన
చనఁగ నుత్తర నర్తనశాలకరిగె.　　24

ఆ. మెఱుఁగు మొగిలుఁజొచ్చు తెఱఁగున నాట్యమం
దిరముఁజొచ్చి తనదు గురువుకడకు
నరిగి నెమ్మి నిట్టులను నింతి ప్రార్థనా
వినయ సంభ్రమములు పెనఁగొనంగ.　　25

క. ఇచ్చట నొక కయ్యంబునఁ
జచ్చె మదీయాగ్రజన్ము సారథి తగువాఁ
డెచ్చోటలేమి నాతం
డచ్చు పరుపఁడయ్యె నీక్రియకు నొండొకనిన్.　　26

వ. అది యట్లుండె. నేఁడు కౌరవులు పసులంబట్టిరని కూయివచ్చిన నన్నసన్నద్ధుండై వెనుకందగుల సమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నందిన నీ కెందువ సైరంధ్రి సెప్పినం బ్రియంబంది నిన్నుఁ దోడ్తేఱ నన్నుఁ బనిచిన నేనును నీపాల నాకుఁ జనవుగలుగుటం జేసి యెల్లవిధంబులం దెత్తునని పూనివచ్చితి. నీవును నాపలుకులు

గుఱిచసేయక నీ పెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తర కుమారునకు రథంబు గడపనియ్యకొని యియ్యాపద దలంగ వలయు నిక్లిష్టంబడక తక్కుట నావలని వాత్సల్యంబు గొఱంతపఱచుట యనిన నమ్ముద్దియ పలుకులు ముద్దుసేసి,

క. నగుచు బృహన్నల యిట్లను
జగతీశ్వరపుత్రి నాకు సారథ్యము నే
ర్పుగలదె నీమాటకు నే
మిగులంగావెఱతుఁ బోదు మీరాఁ దెట్లుండెన్. 28

క. భవదీయ ప్రార్థనచేఁ
దివిరి పరమ దుష్కరములు దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార
థ్యవిధం బొకఁడనఁగనేల యంబుజవదనా. 29

వ. అనుచు సంగీత నిలయంబు వెలువడి సలీలంబుగా మెత్త మెత్తన నడతెంచు మత్తశుండాలంబునుంబోలె. 30

—♦ ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిగాఁ జేసికొనుట ♦—

తే. అరుగుదెంచు బృహన్నల నంత నంతఁ
గని నృపాల సుతుండును గారవమున
గౌరవులతోడఁ గయ్యంబుఁ గలిగె నాకుఁ
గడఁగి నేఁడు రథమ్మీవు గడపవలయు. 31

క. నేరిమిమై మఱువు దొఱఁగి
తేరెక్కుము దప్పఁ గ్రుంకఁ దీఱదు నీకున్

సైరంధ్రి సెప్పె నీదగు
బీరమ్మును బెంపులావు వెరవునుమాడ్కిన్. 32

చ. అనుటయు నాటపాటగల
యప్పటికిన్ ననుఁగోరి పిల్వఁ బం
చినఁ దగుఁగాక సంగరము
సేఁతకు సారథిగమ్ము లెమ్ము నీ
వనుటుచితంబె యెల్లెడల
నారసి బాహుబలాఢ్యుఁడైన యొ
క్కని రథమేత్తెఱం గడపఁ
గా నియమింపుము రాజనందనా. 33

వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె. 34

ఉ. ఖాండవమేర్చునప్పుడు ద
గన్ రథ చోదక వృత్తిసల్పి యా
ఖండల సూతికిన్ జయము
గల్ల నొనర్చిన యట్టి బుద్ధియున్
దండితనంబు నిర్వ్యోడన
తక్కెనె నాఁడె సమైత్రి పెంపు మిం
కొంపోకమాట దక్కుము ర
ణోత్సహనం బొనరింపు గ్రక్కునన్. 35

తే. అనిన నాతనిమాటకు నడ్డమాడ
వెఱచినట్టి తెఱంగు భావించి యల్ల
నియ్యకొనుటయు నమ్మనుజేంద్ర సుతుఁడు
దృఢతనుత్రాణ మతనికిఁ దేరఁబనిచె. 36

క. తెప్పించి తొడుగు మీవని
యొప్పించిన నిట్టు నట్టు నొఱవలుగామెఁ
గప్పికొని యా బృహన్నల
యప్పుడు నగియించె నచటి యబలాజనమున్. 37

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ
దత్తనువున మఱువుదొడిగి తానును హృద్యో
దాత్తంబగు కంకటమిడి
చిత్తమునసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడి పడఁగన్. 38

వ. బృహన్నల నవలోకించి. 39

క. హయములఁ బూన్పుము రథమున
రయమున సిడమెత్తుమిపుడ రావలయును గో
చయముగొని యస్మదీయ వి
జయ మాభినందింపఁ బురముజను లెదురుకొనన్. 40

తే. అనిన నీవేమి పనిచిన నట్లచేయ
వలయు నీ వున్నయెడనుండవలయు నీవు
సన్నదెసఁ జనవలయు నాశక్తి యెఱిఁగి
పంచిపనిగొని కడిమిమైఁ బగఱఁ గెలుము. 41

వ. అని పలుకుచు మనంబున ముదంబొదవ న
ధనంజయుండు. 42

క. కాంచన మాలాలంకృత
చంచత్తను లీలమెఱయు జవనాశ్వములం

బూంచి రథంబున మణిమయ
పంచానన కేతు వెత్తెబంధురభంగిన్. 43

వ. ఇట్లు సన్నాహంబున మెఱిసిన సారథింజూచి యుత్తరయుం జెలులు నిట్లనిరి. 44

క. కురువీరులఁ గెలిచి తదం
బరములలోఁ జిత్ర వర్ణభాసురములుగాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ
కరములుగా బొమ్మ పాత్రికలకుం దెండీ. 45

క. అనుడు బృహన్నల యిట్లను
జనపాలక నందనుండు జయలక్ష్మిం జే
కొనునటె చీరలు దెచ్చుట
పనియో యటఁ జూడుఁ డెల్లభంగులఁ దెత్తున్. 46

వ. అనుచు ధనుస్తూణీర కృపాణ ముద్గరాది సాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగలెక్కి పగ్గంబుల స్రుక్కుసక్కం జేయ నుత్తరుండును బసులం బట్టినదెస గోపాలకుల నడిగిన వారు పితృవనంబువలనని చెప్పిన వినుచు రథారోహణంబుసేసి వెడలి పౌరవృద్ధ పుణ్యాంగనా భూసుర సమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవదహనంబున నగ్నునకు నీకతంబున నైన నహాంగల్యం బెట్టిదట్టిదభవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడుమని దీవించి సేసలుసల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముం డయిన

యూ ఫల్గును నైపుణ్యంబున వల్గదశ్వంబగు రథంబు రయంబు నకు మెచ్చుచుం బరేతనిలయప్రాంత దేశంబు సేరంజని, 47

సీ. అభినవ జలధర శ్యామంబు లగు నెడ
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపల చ్ఛాయంబు లగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రంజమరాళి గారంబులై తగుచోట్లు
దళుచుఁ బూఁబొదల చందంబునొంద
హారిద్రరుచి సమానా కృతులగుకావు
లడరెడు పుష్పొదు లట్లు మెఱయఁ

గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిగాపువోయెడి తెరగుదాల్పఁ
గోగణము ముంగలిగనేల గోడివడఁగ
నడచు కౌరవరాజ సైన్యంబుఁ గనియె. 48

—♦ ఉత్తరుండు గురు సైన్యంబు గనుంగొని భయభ్రాంతుఁడగుట. ♦—

క. కని యుత్తరుండు గరుపా
టిన మేను దలఁకు మనము టిచ్చవడిన చూ
పునునై తొట్రుపడుచు ని
ట్లనియె దిగులుసొచ్చి యాబృహన్నల తోడన్. 49

శా. భీష్మ ద్రోణ కృపాది ధన్వినికరా
భీలంబు దుర్యోధన

గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరా
కీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్వల బలా
త్యుగ్రంబు దగ్రధ్వజా
చ్ఛిష్మత్ప్రా కలితంబు సైన్యమిది యేఁ
జేరంగ శక్తుండనే.                    50

క. అకృతాస్త్రుండ బాలుఁడఁ గా
న్యకవిద్యా ప్రౌఢిమైని రూఢులయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ
వికర్ణ కర్ణాది యోధవీరుల కెదురే.                    51

క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి
మెట్టెక్కొ మనభంగి వీరలిందఱును గడున్
బెట్టిదులు మనకు మార్కొను
నట్టి కొలఁదిగాదు భీతియడరెడుఁ దొట్టోన్.                    52

ఉ. కౌరవసేనఁ జూచి వడ
కందొడఁగెన్ మదిలోన మేను నీ
వ్వారక పోవుచున్కి యిది
యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి
నిశ్చయ మట్లగుటన్ రయంబునన్
దేరు మరల్పు ప్రాణములు
దీపన మున్వసవే బృహన్నలా.                    53

వ. అనిన దరహాసిత వదనుండగునా శతమఖతనయుం
డతని కిట్లనియె. 54

చ. అసదృశలీలఁ బొల్చు రథి
కావలిమీఁదఁ జనంగ వెట్టినే
మసలక యామిషంబుగొని
మార్గము వట్టిన తుచ్ఛసైన్యమున్
వెసఁజని మట్టిగోధనము
వేగ మరల్తముగాక యిమ్మెయిం
బసులటుపోవఁగా మరలఁ
బాడియె నీకు నరేంద్ర నందనా. 55

ఉ. అంతిపురంబులోనఁ గల
యంగన లెల్లను నెమ్మనంబులన్
సంతసమందఁగాఁ బసులఁ
జయ్యనఁ దెచ్చెదనంచుఁ బూని నీ
వెంతయు మేటివై యరద
మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతి తురంగ సద్భట క
దంబము చూచి కలంగఁబొప్పునే. 56

ఆ. అనినపలుకులకు బృహన్నలఁ గనుఁగొని
యెలుఁగువడఁగ నాతడిట్టులనియెఁ
బసులదయ్య మెఱుఁగఁబడతుల సంతోష
మేలనాకు ననికిఁజాలనేను. 57

వ. అనవుడు. 58

చ. తనభుజశక్తియున్ రిపుల
దర్పము నేర్పడఁ జూచిచూచి యెల్లును
దెగకున్నఁ బోకయిది
లోకము చక్కటి శూరులైన దీ
నిని మదిమెచ్చరీ బలము
నీ దెసఁ బేటికెయుఁ జూడదింతకున్
మునుభయహేతువైన విధ
మున్ దగఁజెప్పుము నాకని త్తతిన్. 59

సీ. దెసలుబీఁటలు వాఱఁ దివురు చిందముల కో
లాహాలంబులకుఁ గలంగఁ బడక
యురవడిసేనలు దెరలఁబైఁ దో తెంచు
ధూళి పెల్లడరినఁ దూలపోక
చతురంగ బలమతి సాంద్రతఁ గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్గాంగ
తతినాఁటు తఱుచునఁ దల్లడిలక

బహు విధంబులఁ బగతుర బరవసమున
నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్లనోర్చి
నిల్చిగెల్చిన సత్కీర్తి నెగడుఁగాక
దవ్వుదవ్వుల విఱిగిన నవ్వరెల్లు. 60

చ. అను దివిజేంద్ర నందనున
కమ్మనుజేశ్వర సూనుఁడిట్లనున్
వినుము త్రిగర్తవాయువులు
విక్రమసంపద సొంపుమీఱ గో
ధనములఁబట్టినం బతి యు
దగ్రత సైన్యము లెన్ని యన్నియుం
గొని యటఁబోయెఁగాక మన
కుం బురిఁబాసటలేర యెవ్వరున్. 61

తే. ఒంటి దలపడి కురుసేననోర్చువాఁడ
నే నుఁడేటికి వెడమాట లిట్టులాడ
వారు గానక ముందఱ తేరుదోలు
కొని రయంబునఁ బురి కరుగుటయనీతి. 62

వ. అనినం బాష్పంబు పార్థివనందనున కిట్లనియె. 63

క. వెగడొంది యిట్లు వలుకఁగ
నగు నే పగతురు ప్రమోదమందఁగఁ బసులన్
దిగవిడిచి పురజనంబులు
దెగడంగా మగిడి పోక దీనతగాదే. 64

వ. అట్లుంగాక, 65

మ. వను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా
నం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితివీవు బంటుతన మ
ట్లగ్గించి పౌరాలి దీ

వనలిచ్చెందుదిఁ బోయి కౌరవులు గో
వర్గంబుఁ గొంపోవఁగాఁ
గనియేఁ గ్రమ్మఱి రిత్తవోదు నె భయో
త్కంపంబు నీకేటికిన్. 66

తే. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁబట్టు
మిపుడ కౌరవ సైనికు లెల్లఁజూచి
వెల్లఁగుపడ వేగమును లావు వెరవు మెఱయఁ
గదుపు బెట్టించి పోదము క్రమ్మఱంగ. 67

వ. అనుచు నివ్వచ్చుండు గడంగి తేరువోవనిచ్చుటయు నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నా భూవల్లభ కుమారుండు, 68

క. దవ్వుల విఱిగినఁ బాపలు
నవ్వుదురకొ మేలు మేలు ననునాగకు నీ
క్రొవ్వఱుగ దేనిఁ దలపడు
మెవ్విధిఁ జనితేమి యనుచు నెత్తిన భీతిన్. 69

క. శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గవిడచి యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురిదెసకును లజ్జవిడిచి పోవం బాఱెన్. 70

శ్రీ

# ముక్తావళి.

## శ్రీమదాంధ్ర భాగవతము.

### అష్టమస్కంధము.



— వామనమూర్త్యావిర్భావ ఘట్టము. —



వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 1

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం
వాసస్థలం బెయ్యది
య్యెడకున్ నీ వరుదెంచుటన్ సఫల మ
య్యెన్ వంశమున్ జన్మమున్
గడుధన్యాత్ముఁడ నైతి నీముఖము యో
గ్యంబయ్యె నా కోరికల్
గడ తేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం
గల్యాణ మిక్కాలమున్. 2

మ. వరచేలంబులొ మాడలో ఫలములో
వన్యంబులో గోవులో

హారులో రత్నములో రథంబులో విమృ
ష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో
గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యేమడిగెదో
ధాత్రీ సురేంద్రోత్తమా. 3

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచని వచనంబులు విని సంతసించి యాశ్వాసం డిట్లనియె. 4

సీ. ఇదినాకు నెలవని యేరీతిఁబలుకుదు
నొకచో టనక యెందునుండ నేర్తు
నెవ్వరివాఁడనం చేమని పలుకుదు
నాయంతవాఁడనై నడవనేర్తు
నీనడవడియని యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తునని యేలచెప్పంగ
నేరుపులన్నియు నేననేర్తు

నొరులు గారునాకు నొరులకు నేనాదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లిగలదు చెప్పెదనాటెంకి
సుజనులందుఁ దలచు సొచ్చియుండు. 5

వ. అది యెట్లుండనిమ్ము. 6

సీ. జననాథ నీమాట సత్యంబు సత్కీర్తి
దంబుఁ గులార్హంబు ధర్మయుతము
గరుణానువర్తులు ఘనతత్త్వమూర్తులు
గాని మీకులమందుఁ గలుగరొరులు
రణభీరువులు వితరణభీరువులు లేరు
ప్రత్యర్థులర్థులు ప్రబ్బికొనిన
దాన శౌండిమమునఁ దనుపుదు రధికులై
మీతాతలందఱు మేఁటిమగలు
మీకులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు
మింటి చంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రథితకీర్తితోడ భవదీయ వంశంబు
నీరరాశిభంగి నెగడుచుండు. 7

వ. తొల్లి మీ మూఁడవ తాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుండై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప విష్ణుండు వరాహ రూపంబున నతని సమయించెఁ దద్భ్రాతయగు హిరణ్యకశిపుండది విని హరి పరాక్రమంబునకు నాశ్చర్యంబునంది తన జయంబునుం బలంబునుం బరిహసించి గ్రద్దన నుద్దవిడి నద్దనుజ మర్దను మందిరంబునకుం జనియె నప్పుడు, 8

క. శూలాయుధ హస్తుండై
కాలాకృతి వచ్చుదనుజుఁ గనివిష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణ
శీలత నిట్లని తలంచెఁ జిత్తములోనన్. 9

మ. ఎదురై పోర జయింప రాదితనిఁ గా
కెందేనినిం బోవ భీ
ప్రదుఁడై ప్రాణులఁ దోలు మృత్యువు క్రియం
బైవచ్చునంచుం గ్రియా
విదుఁడబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నా
వేశించె నిశ్వాసరం
ధ్రదిశన్ దైత్యు హృదంతరాళమునఁ బ్ర
త్యక్ క్రియా భీరుఁడై. 10

వ. అంత నద్దైత్య వల్లభుండు వైష్ణవాలయంబుసొచ్చి వెదకి హరిం గానక కోపంబుమానక మిన్నుమన్ను నన్వేషించి త్రిదివంబున నరసి దిశలం బరికించి భూవివరంబులు వీక్షించి సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, పాతాళంబు పరీక్షించి, జగంబున నదృష్ట శత్రుండై మార్గణంబు సాలించి తనలో నిట్లనియె. 11

క. పగవాఁడు మడియనోపును
దెగఁజేసిని నెదురుపడఁడె దేహధరులకుం
దెగినయెడఁ బగఱుమీఁదను
బగఁ గొనఁదగ దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్. 12

వ. అతండు మీ ప్రపితామహుం డతని గుణంబు లనేకంబులు గలవవి యట్లుండనిమ్ము. 13

క. ఆతుర భూసురగతిఁ బురు
హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొండనుచున్

మీ తండ్రి యిచ్చినాయువు
నే తన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్. 14

క. ఏలితివి మూఁడుజగములుఁ
దోలితి వింద్రాదిసురులఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణముల
సోలితివి పిశాచ రాక్షసుల రక్షింపన్. 15

వ. అదియునుం గాక. 16

క. రాజ్యంబు గలిగెనేనిని
బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగఁ బ్రతుకఁడేనిం
త్యాజ్యంబులు వాని జన్మ ధన గేహంబుల్. 17

క. మున్నెన్నదురు వదాన్యుల
నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుండనుచున్,
ఇన్ని దినంబుల నుండియు
నెన్నఁడునినుఁ బెట్టుమనుచు నింద్రముసేయన్. 18

ఆ. ఒంటివాఁడ నాకునొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము మేరయొల్లఁ
గోర్కిదీర బ్రహ్మకూఁకటి ముట్టెద
దాన కుతుకసాంద్ర దానవేంద్ర. 19

వ. అనినఁబరమ యాచకునకుఁబ్రదాతయిట్లనియె. 20

ఆ. ఉన్నమాటలెల్ల నొప్పును విప్రేంద
సత్యగతులు వృద్ధ సమ్మతంబు

లడుగఁదలఁచి కొంచెమడిగితివో చెల్ల
దాత పెంపు సొంపుఁదలఁప వలదె. 21

వ. అని మఱియు నిట్లనియె. 22

మ. వసుధాఖండము వేఁడితో గజములన్
వాంఛించితో వాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్
వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేరవీవడుగ నీ
భాగ్యంబు లీపాటిగా
కసు రేంద్రుండు పదత్రయంబడుగ నీ
యల్పంబు నీ నేర్చునే. 23

వ. అని మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె. 24

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నా
కున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్
వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదా
కాంక్షామితంబైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్ర
హ్మాండంబు నాపాలికిన్. 25

వ. అదియునుంగాక. 26

క. వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే. 27

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపులే దంతంబు రాజేంద్ర వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు సేకూడియుం
గాసింబొందరిగాక వైన్యగయ భూకాంతాదులున్నర్థకా
మాశంబాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులన్ జూచిరే. 28

వ. అని యిట్లుపలుకుచున్న ఖర్వునకు నుర్వీదానంబు సేయదలంచి కరకలిత సలిలకలశుండైన యవ్వితరణ ముఖరునిం గని నిజవిచారయుక్త దనుజరాజ్య చక్రుండగు శుక్రుండిట్లనియె. 29

సీ. దనుజేంద్ర యీతఁడు ధరణీసురుఁడుగాఁడు
దేవకార్యంబు సాధించు కొఱకు
హరివిష్ణుఁడవ్యయుం డదితి గర్భంబునఁ
గశ్యపసూనుఁడై గలిగెనకట
యెఱుఁగ కీతనికోర్కి నిచ్చెదవంటివి
దైత్యసంతతి కుపద్రవమువచ్చు

నీలక్ష్మిఁ దేజంబు నెలవు నైశ్వర్యంబు
వంచించి యిచ్చుఁ దా వాసవునకు
మొనసి జగములెల్ల మూఁడు పాదంబుల
నఖిలకాయుఁ డగుచు నాక్రమించు
సర్వధనము విష్ణు సంసర్జనముసేసి
బడుగువగిది నెట్లు బ్రదికెదీవు. 30

క. ఒక్కపదంబున భూమియు
నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దానై
వెక్కసమైయున్న నెందు వెడలెదు చెపుమా. 31

సీ. ఇచ్చెదనని పల్కి యీకున్న నరకంబు
దోఁచివసీవును సమర్థుఁడవు గాన
యేదానమున నాశ మేతెంచునదియును
దానంబు గాదండ్రు తత్త్వవిదులు
దానంబు యజ్ఞంబుఁ దపముఁ గర్మంబును
దావిత్తవంతుఁడై తలఁపవలయుఁ
దనయింటఁ గలసర్వ ధనమును నైదు భా
గములుగా విభజించి కామమునకు
నర్థమునకు ధర్మయశములఁ కాశ్రిత
బృందములకు సమతఁ బెట్టునట్టి
పురుషుఁ డిందునందుఁ బూర్ణుఁడై మోదించుఁ
దన్నుమానిచేఁత దగవుగాదు. 32

వ. అదియునుంగాక యీ యర్థంబునందు బహుభంగి బహ్వృచగీతార్థంబు గల దొక్కటి సావధానుండవై యాలకింపుము. 33

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు
నడుగ లేదటంచు నన్నృతమాడు
చెనఁటి పంద నేమి సెప్పఁ బ్రాణముతోడి
శవమువాఁడు వాని జన్మమేల. 34

వ. మఱియు నిందొక్క విశేషంబుగలదు వివరించెద 35

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమాన భంగమందుఁ
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము వొందఁడధిప. 36

మ. కులమున్ రాజ్యము తేజమున్ నిలుపుమీ
కుబ్జుండు విశ్వంభరుం
డలఁతింబోడు త్రివిక్రమస్ఫురణవాఁ
డై నిండు బ్రహ్మాండమున్
గలఁడే మాన్పనొకండు నాపలుకు లా
లాకర్ణింపు కర్ణంబులన్
వలదీ దానము గీనమున్ బనుపు మా
వర్ణిన్ వదాన్యోత్తమా. 37

అని ఇట్లు హితంబు వలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్ర నిమీలిత లోచనుండయి యశస్వి యిట్లనియె. 38

సీ. నిజమానతిచ్చితినీవు మహాత్మక
మహిని గృహస్థ ధర్మంబు నిడియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తుననియు
నర్థలోభంబున నర్థిఁబొమ్మనుటెట్లు
పలికి లేదనుకంటెఁ బాపమెద్ది
యెట్టి దుష్కర్మని నే భరించెదఁగాని
సత్యహీనునిమోవఁ జాలననుచుఁ
బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటెఁ
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె 39

క. ధాత్రిని హాలికునకును సు
క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం
జిత్రముగ దాతకీవియుఁ
బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే. 40

శా. కారేరాజులు రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటఁ గట్టుకొని పో
వంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే
యిక్కాలమున్ భార్గవా. 41

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ
బొడగనఁజననట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినఁట నను బోఁటికి
నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్. 42

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబుఁ గ్రిందగుట మీఁదై నాకరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే. 43

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్. 44

ఆ. నొడివినంత నట్టి నుసలక యిచ్చుచో
నేలకట్టు పిణ్ణుఁడెట్టిమాట

గట్టినేనిఁ దానకరుణించి విడుచును
విడువకుండనిమ్ము విమలచరిత.  45

క. మేరువు దలక్రిందైనను
పారావారంబు లింకఁ బారిన లోలో
ధారుణి రజమైపోయినఁ
దారాధ్వముబద్ధమైనఁ దప్పకయిత్తున్.  46

మత్త. ఎన్నఁడున్ బరువేఁడఁబోఁడఁట
యేకలుండఁట కన్నవా
రన్నదమ్ములునైన లేరఁట
యన్నివిద్యల మూల గో
ష్టి న్నెఱింగిన ప్రోఁడగుజ్జఁట
చేతులొగ్గివసింప నీ
చిన్నపాపనిఁ ద్రోసిపుచ్చఁగఁ
జిత్తమొల్లదు సత్తమా.  47

వ. అని యిట్లు సత్యపదవీ ప్రమాణ తత్పరుండును, వితరణీ కుతూహల సత్వరుండును, విమల యశస్కుండును, దృఢ మనస్కుండును, నియత సత్యసంధుండును, నర్థిజన కమలబంధుండునైన బలింజూచి శుక్రుండు గోపించి మదీయ శాసనం బతిక్రమించితివిగాన శీఘ్రకాలంబునఁ బద భ్రష్టుం డవుగమ్మని శాపంబిచ్చె. బలియును గురుశాప తప్తుండయ్యు నసృతమార్గంబున కభిముఖుండు గాకుండెనప్పుడు  48

ఆ. బ్రదుకవచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁ గాక పడుఁగాక
మాటఁదిరుగలేరు మానధనులు. 49

వ. అయ్యవసరంబున 50

ఆ. దనుజలోకనాథు దయితవింధ్యావళి
రాజవదన మదమరాళగమన
వటుని కాళ్ళుగడుగ వరహేమఘటమున
జలముదెచ్చె భర్త సన్నయెఱిగి. 51

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం
డిట్లనియె. 52

క. రమ్మా మాణవకోత్తమ
యెమ్మా నీవాంఛితంబు లేదనకిత్తున్
దెమ్మా యడుగుల నిటురా
నిమ్మా కడు గంగవలయు నేటికిఁ దడయన్. 53

వ. అనిన విని 54

మ. బలిదైత్యేంద్ర కరద్వయీ కృత జల
ప్రక్షాళన వ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగి సుమన
స్సంప్రార్థిత శ్రీదమున్
గలితానమ్ర రమాలలాట పదవీ
కస్తూరికా శాదమున్

నలినామోదము రత్ననూపురితనానా వేదముం బాదమున్. 55

క. సురలోక సముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిలనిగమాంతాలం
కరణము భవ సంహరణము
హరిచరణము నీటఁగడిగె నసురోత్తముఁడున్. 56

వ. ఇట్లు ధరణీసుర దక్షిణ చరణ ప్రక్షాళనంబుసేసి వామపాదంబు గడిగి తత్పావన జలంబు శిరంబునం జల్లుకొని వార్చి, దేశకాలాది పరిగణనంబుసేసి. 57

శా. విప్రాయ ప్రకటవ్రతాయ భవతే
విష్ణుస్వరూపాయ వే
ద ప్రామాణ్యవిదే త్రిపాదధరణిం
దాస్యామియంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం
జేసాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం
బాశ్చర్యముం బొందగన్. 58

వ. తత్కాలంబున. 59

ఆ. నీర ధారఁబడఁగ నీక యడ్డంబుగాఁ
గలశ రంధ్రమాఁపఁగాను దెలిసి
హరియుఁ గావ్యునేత్రమటఁ గుశాగ్రంబున
నడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు. 60

వ. అంత. 61

మ. అమరారాతి కరాత్తశోజ్ఝిత పవి
త్రాంభఃకరశ్రేణికిం
గమలాధీశ్వరుఁడొడ్డె ఖండిత దివౌ
కస్స్వాజిస్మ్రస్తముం
గమలాకర్షణ సుప్రశస్త మురమా
కాంతా కుచోహస్తమున్
విమల శ్రీకుచ శాతచూచుక తటీ
విన్యస్తమున్ హస్తమున్. 62

క. ముని జన నియమాధారను
జనితాసుర యువతి నేత్ర జలకణ ధారన్
దనుజేంద్ర నిరాధారను
వనజాక్షుఁడు గొనియె బలి వివర్జిత ధారన్. 63

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్రమనుచునిచ్చె దానము బలి
మహి వదాన్యుఁడొరుఁడు మఱియుఁ గలఁడె. 64

క. బలి సేసిన దానమునకు
నలినాక్షుఁడు నిఖిలభూత నాయకుఁడగుటం
గలకలమని దశదిక్కులు
బళిబళియని పొగడె భూతపంచక మనఘా. 65

క. క్షితి దాన మిచ్చినతఁడును
నతికాంతుఁ బరిగ్రహించినతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడసలుపుదు రెలమిన్. 66

వ. అట్లుగావున నేదానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు. కావున వసుంధరాదానంబిచ్చితి వుభయలోకంబులం గీర్తి సుకృతంబులు వడయుమని పలికి యమ్మాహా వటుం డిట్లనియె. 67

క. ఇది యేమి వేఁడితని నీ
మది వగవక ధారవోయుమా సత్యము పెం
పొదవఁగఁ గోరిన యర్థం
బది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 68

వ. అని పలికిన వటుని పలుకులకు హర్షనిర్భర చేతస్కుండై వైరోచనుండు, 69

ఆ. పుట్టి నేర్చుకొనెనో పుట్టక నేర్చెనో
చిట్టిబుద్ధులిట్టి పొట్టివడుగు
పొట్టనున్నవెల్ల బూమెలునని నవ్వి
యెలమి ధరణి దానమిచ్చె నప్పుడు. 70

---

శ్రీ

# ముక్తావళి.

## శ్రీ కాశీఖండము.

### సప్తమాశ్వాసము.

—♦ వేదవ్యాసుఁడు కాశిమీఁద గోపించుట. ♦—



వ. ఇవ్విధంబునం బెద్ద కాలంబు గాశీ నగరంబునఁ గృష్ణద్వైపాయనుండు శిష్యవర్గంబును దానును నపవర్గపదవీ కల్యాణలాభార్థంబు వసియింప నమ్ముని మనస్స్థైర్యంబు పరీక్షింపందలంచి విశ్వేశ్వర శ్రీ మహాదేవుండు విశాలాక్షి కిట్లనియె.

గీ. బాదరాయణుభక్తి యేపాటియదియొ
యరయుదముగాని యతఁడు భిక్షాటనమున
కేఁగుదెంచిన యప్పుడింటింట భిక్ష
గలుగకుండంగఁ జేయంగ వలయు నీవు. 2

వ. అనిన నద్దేవి మహాప్రసాదంబని యఖిల భూతాంతర్యామిని గావునఁ గాశికా నగరంబున గృహిణీ గృహస్థుల

యంతరంగంబుల నధివసించి భిక్షాప్రదాన ప్రతిష్టంభ కార
ణంబై యుండె. కృష్ణద్వైపాయనుండును 3

సీ. కాలోచితములైన కరణీయములు దీర్చి
నరుణోదయముగాఁక యటకమున్న
గంగలోఁ జక్ర పుష్కరిణీ ప్రవాహంబున
నఘమర్షణ స్నాన మాచరించె
నరుణాంశు మండలం బర్ధోదయమునందు
సమయంబు వీక్షించి సంధ్యవార్చి
నిలుచుండి జపియించి నియతిమై గాయత్రి
సంఖ్య యష్టోత్తర శతముగాఁగ
నగ్ని కార్యము దీర్చిఁ గామారిఁగొల్చి
ముక్తి మంటపికా మధ్యమునఁ బఠించె
శివ పురాణంబు మధ్యాహ్నసీమదాఁక
నపర నారాయణుఁడు బాదరాయణుండు. 4

మ. ఝుటితస్ఫూర్తి పలాశపత్ర పుటికా
శాటీప్రదేశంబులున్
ఘటముల్ దామరపాసలున్ గుహాళులున్
గంఠోలముల్ పూని బా
సట వేదంబుఁ బఠించుచుం గదిసి వై
శంపాయనాదుల్ సము
త్కటభంగిం గొలువంగ నేగె ముని భి
క్షాకృత్య యాత్రార్థమై. 5

గీ. నెట్టుకొని కాయ బీరెండ పట్టపగలు
తాను శిష్యులు నిల్లిల్లు దప్పకుండఁ
గాశికా విప్రగృహవాటికల నొనర్చె
నఖిల విద్యాగురుండు భిక్షాటనంబు. 6

శా. ఛాత్రుల్ పైల సుమంత జైమినిలు వై
శంపాయనుం డాదిగాఁ
గాత్రంబుల్ ఘటియించి యన్ని దెసలన్
ఖైక్షంబు వేఁడంగ స
ద్ధుత్రాధీశ్వర మౌళి పట్టణమునం
గాశిం దలంపన్మహా
చిత్రం బోగిర మబ్బదయ్యె ఋషికిం
జేకూరదయ్యెం బుదిన్. 7

గీ. తిరిగె నింటింట 'భిక్షాం ప్రదేహి' యనుచు
బాదరాయణుఁ డీశానుపట్టణమున
నొట్టు పెట్టినభంగి నేయుగ్మలియును
బిలిచి యొకపట్టెఁ డన్నంబు పెట్టదయ్యె. 8

గీ. వండుచున్నార మనునొక్క వనజనేత్ర
తిరిగి రమ్మనునొక్క లేఁదీఁగెబోఁడి
చేఁకార్యంబు నేఁడను తెలవయో త్త
ద్వ్యాఃకవాటంబుఁ దెఱువదు వనిత యొకతె. 9

వ. ఇవ్విధంబున భాగ్యహీనుండు ధనంబునుంబోలె భిక్షాన్నంబు వడయలేక మఠంబునకుం జని జరత్క్షుధావ్యధా

ఘూయమాన మానసుండై కృష్ణద్వైపాయనుండు శిష్యుల
రావించి యిట్లనియె. 10

గీ. అబ్బనే నేఁడు మీకు మధ్యాహ్నభిక్ష
బ్రహ్మపురివాడఁ గాశికాపట్టణమున ?
అబ్బదో నాకపోలె మహాత్ములార !
వాడవాడల నీపెద్దవల్లకాట ? 11

సీ. గుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని
కడపని గృహసూతకంబునందు
నింటఁ బీనుంగువోయినదేని గడపని
కడపని పెనుద్రిమ్మ కవిసెనేని
కులయేశుండు దండువగొన్నఁగడపని
కడపని భవనంబు గాలెనేని
పితృకార్యవిధి సమీపించినఁ గడపని
కడపని ముట్టంటు గవిసెనేని
వేళగాకున్నఁ గడపని వేలుపులకు
మీఁదువోకున్నఁ గడపని మిన్నకెట్లు
గడపెనింటింట నీ కాశికాపురమునఁ
బుణ్యగేహిని యిది మహోత్పాతముగాదె ? 12

వ. పెద్దకాలంబునంబట్టి మనమున్నవార మిక్కాశీ
పట్టణంబున భిక్షాన్నంబుపుట్టని దినంబునుం గలదె ? కృతప
కాలంబున. 13

సీ. ముంగట గోమయంబున గోముఖముదీర్చి
కడలునాల్గుగ ముగ్గుకట్టువెట్టి
యతిథి నచ్చోనిల్పి యర్ఘ్యపాద్యములిచ్చి
పుష్ప గంధంబులఁ బూజచేసి
ప్రక్షాళితంబైన పసిఁడి చట్టువమున
నన్నంబునునిచి నెయ్యభిఘరించి
ఫల పాయసాపూప బహు పదార్థములతో
భక్తి విశ్వాస తాత్పర్యగరిమఁ
బెట్టుదురు మాధుకరభిక్ష భిక్షుకులకుఁ
గంకణంబులతో సూడిగములు రాయఁ
గ్రమకరముల బ్రాహ్మణాంగనలుగారి
యన్నపూర్ణ భవాని కట్టనుఁగుఁజెలులు. 14

క. ఆపరమ పురంధ్రుల యం
దేపుణ్యాంగనయు భిక్షయిడదయ్యెఁ గటా
కేపాడి మేలుకని యే
నేపాపాత్ముని ముఖంబు నీక్షించితినో. 15

గీ. వాడఁబాఱినయవి వక్త్రవనరుహములు
భాజనంబులలోన నిప్పచ్చరంబు
మీకు భిక్షాన్నములు లేమి నాకుఁదెలిసెఁ
జేలపంటలఁ గోయ్యలే చెప్పఁగాదె. 16

వ. చతుర్విధ పురుషార్థములకు నకట పుట్టినిల్లయిన
యిక్కాశీపట్టణమునకు నేఁడుభిక్షాన్నంబు పుట్టమికిఁ గారణం

బెయ్యదియో మీరు పరామర్శించి రండనిన నట్లకాకయని గురు నియోగంబున నందఱు నన్నిముఖంబులకుంజని యేయవకరంబునుం బొడఁగానక క్రమ్మఱవచ్చి శిష్యులందఱు బాదరాయణున కిట్లనిరి. 17

గీ. అవధరింపుము నారాయణావతార
బాదరాయణ, కాశికా పట్టణమున
నవకరము లేదు నీయట్టి యధిక పుణ్యు
లుండ నివ్విటి కెట్లు గీడొందనేర్చు. 18

సీ. విశ్వేశ్వరుండెందు విచ్చేసి యున్నాఁడు
కైలాస శైలశృంగంబు విడిచి
ప్రవహించు నెందేని భాగిరథీగంగ
యుపకంఠమున హారమో యనంగ
నాఁకొన్నవారికి నమృత దివ్యాన్నంబుఁ
గృపసేయు నెందేని గిరితనూజ
యుండు డుంఠివినాయకుండెంచు నొసలిపై
యువరాజ పట్టంబు నవధరించి
యెంచులనునుండు మీయంత లేసివారు
పరమపుణ్యులు సంయమీశ్వరు లనేకు
లట్టి కాశిని భిక్షాన్న మబ్బదనుట
వినఁగ బోసఁగునె యిది యేమి విధమొ కాక. 19

సీ. జిలుఁగు సంధ్యారాగ చీనాంబరము గట్టి
కుసుమగర్భముగఁ గీల్కొల్పుదుటిమి

కస్తూరి మేదించి గంధసారములంది
ముత్యాల తాటంకముల ధరించి
సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి
కురులపైఁ జన్నిపూగు_స్తరించి
శ్రీపాదముల హేమ నూపురంబులు దాల్చి
కటిమీఁద వజ్రాల కమరు నిల్పి
యన్నపూర్ణ విశాలాక్షి యనెడు పేళ్ళఁ
గాశికామధ్య శృంగాటకములయందు
విశ్వపతి దేవి మధ్యాహ్న వేళఁ బెట్టు
నమృత పాయస దివ్యాన్న మనుదినంబు. 20

గీ. మనము మనమన పూర్వజన్మములయందుఁ
గడపినారము మధ్యాహ్న కాలభిక్ష
యనుభవింపక పోవంగ నలవియగునె
కమలజునికైనఁ బ్రారబ్ధ కర్మఫలము. 21

క. అందఱు భుజంగ భూషణు
లందఱునుం గాలకంఠు లందఱు గిరిశుల్
అందఱు ధృతేందు కళ లా
నందవనీనగర నివసనస్థితులు నరుల్. 22

గీ. బ్రహ్మలోకంబు గాశికి బడిసివాటు
విష్ణులోకంబు గాశికి వినిమయంబు
దాసదాసానుదాస బృందంబు గాశి
కింద్ర చంద్రాది లోకంబు లిద్ధమహిమ. 23

సీ. శివుని నివాళించు శేషాహి నడురేయి
బహుఫణారత్న దీపములచేత
నంతర్హితంబులై యర్చించు నీశాను
ఫలపుష్పములఁగల పాదపములు
కామధేనువు లిందు ఖండేందు శేఖరు
నూఘస్య ధారల నోలలాడ్చు
నిధులు దొమ్మిదియుఁ గంతేకాలునకునిచ్చు
నిర్మల మణులు గానికలుగాఁగ
గాశికాపట్టణంబు శంకరుని నెలవు
కలిప్రవేశింప దానందకాననమున
శ్రీనివాసంబు వారణాసీపురంబు
ముక్తిసంధాయకం బవిముక్తకంబు. 24

వ. అని శిష్యులు గాశీమాహాత్మ్యంబు ప్రశంసించిన
వని బాదరాయణుండు వారల కిట్లనియె. 25

గీ. ఉపవసింతుముగాక నేఁడుడిగి మఱిఁగి
యస్తమించుచున్నవాఁ డహిమభానుఁ
డెల్లిపారణలైన లేదెట్టు మనకు
మాధుకరభిక్ష బ్రాహ్మణ మందిరముల. 26

వ. అని యాత్రాకగడపి మఱునాఁడు మధ్యాహ్న
కాలంబున శిష్యులుం దానును వేఱువేఱ వేదవ్యాసుండు
విప్రభవనవాటిక భిక్షాటనంబొనర్చి తొలునాఁటి యట్ల
ముక్కంటిమాయ నేమచ్చకంటియు వంటకంబువెట్టకున్నఁ

గటకటంబడి భిక్షాపాత్రంబు నట్టనడువీథిం బగులవైచి కోపాటోపంబున. 27

గీ. ధనమదంబును వేదవిద్యామదంబు
మోక్షలక్ష్మీమదంబును ముదిరికాదె
కాశికాపట్టణంబునఁ గరుణలేక
బ్రాహ్మణులునన్ను నిటు భంగపఱచిరనుచు. 28

వ. కృష్ణద్వైపాయనుం డాత్మగతంబున. 29

గీ. ధనములేకుండెదరు మూఁడు తరములందు
మూఁడు తరములఁ జెడుఁగాక ముక్తిలక్ష్మి
విద్యయును మూఁడుతరముల వెడలవలయుఁ
బంచజనునకుఁ గాశికాపట్టణమున. 30

వ. అని పారాశర్యుండు క్షుత్పిపాసా పరవశుండై శపియింపఁ జూచు నవసరంబున నొక్క విప్రభవనంబువాకిటఁ బార్వతి ప్రాకృతవేషంబున. 31

ఉ. వేనలిపాటపాట నర వెంట్రుకతోఁ
దిల తండులాన్వయ
శ్రీనటియింపఁ గైనడలి
ప్రేఁకని చన్నులు పాలవంకలై
కౌనసిమూర్ప వాలుఁదెలి
కన్నులఁ గల్కితనంబు పీడ్కొనన్
మానిని హస్తమూది యొక
మంజులభాషిని వచ్చె వీథికిన్. 32

ఉ. వేద పురాణశాస్త్రసద
వీ సదవీ యశస్వియైన పెద్ద ము
త్తైదువ కాశికానగర
హాటక పీఠ శిఖాధిరూఢ య
య్యాదిమశక్తి 'సంయమివ
రా యిటురా' మ్మని పిల్చె హస్తసం
జ్ఞాదరలీల రత్నకట
కాభరణంబులు ఘల్లుఘల్లనన్. 33

వ. చేరంబిల్చి యమ్మహత్తకాశిని సాత్యవతేయున
కిట్లనియె. 34

శా. ఆకంఠంబుగ నీవు మాధుకర భి
క్షాన్నంబు భక్షింపఁగా
లేకున్నం గడునంగలార్చెదవు మే
లే, లెస్స శాంతుండవే
నీకంటె న్మతిహీనులే కటకటా
నీవార ముష్టింపచుల్
శాకాహారులుఁ గందభోజులు శిలో
ఛప్రక్రముల్ తాపసుల్. 35

గీ. ఓ మునీశ్వర వినవయ్య యున్నయూరు
గన్నతల్లియు నొక్కరూపన్నరీతి
యటు విశేషించి శివుని యర్ధాంగలక్ష్మి
కాశి యివ్వీటిమీఁద నాగ్రహము దగదు. 36

సీ. వేయిశాఖలతో సామవేదరాశి
యేకవింశతి భేదమై ఋఙ్నిగమము
తొమ్మిదియు నూటయొక్కండ్రు త్రోవలంది
యొరిమె నాథర్వణ యజుస్సులుండుఁగాశి. 37

వ. ఇట్టి కాశికా నగరంబుమీఁద భిక్ష లేకుంట కారణంబుగా నీయంతవాఁడు గటకటంబడి శపియింపఁ దలంచునె బ్రాహ్మణుండవుగదా నీ వేమన్ననుం జెల్లు. అటు విశేషించి యాఁకొన్నవాఁడవు. కావున నీయవసరంబున నిన్ను హెచ్చుకుందాడుట మముబోఁటి గృహిణులకు మెచ్చుగాదు. మాయింటికిం గుడువరమ్ము. కుడిచి నమ్మన్న పిమ్మటం గొన్నిమాటలు నీతోనాడఁగల నిప్పుడు, 38

గీ. వైశ్వదేవాదివిధుల సర్వమును దీర్చి
యరయుచున్నాఁడు నాభర్త యతిథిరాక
యతిథిపంక్తికి రాకున్న నారగింపఁ
డొంటి నొకనాఁడుఁ బతియెట్టి యొజ్జకమునను. 39

గీ. అభ్రగంగ నుపస్పర్శమాచరించి
వేగ విచ్చేయుమలయు నావిభుఁడు దశమి
యాఁకటికి నోర్వలేఁడు బ్రాహ్మణవరేణ్య
యర్కమండల మిదె వ్రాలె నపరదిశకు 40

వ. అనిన వేదవ్యాసుండు ముక్తైదువ కిట్లనియె. 41

సీ. కమలలోచన కిన్నరాంగనవె నీవు
నీవు గంధర్వభామవే నీలవేణి

అప్సరస్త్రీవె నీవు బింబాధరోష్ఠి
రమణి నీవు విద్యాధరరాజసుతవె.                    42

సీ. కాల్యాణి నిన్ను నీ కాశికాపురములో
నెన్నండుఁగాన నీ వెవ్వరమ్మ
నిన్ను దర్శింపంగ నిఖిలేంద్రియములకు
నత్యంత సంతృప్తి యానవహీఁ
రాహుదంష్ట్రాంకుర క్రకచ ఘట్టనభీతి
జగతికేతెంచిన చంద్రకళవె
నన్నురక్షింపంగ నాపాల గల్గిన
భాగ్యదేవతవు తప్పదు నిజంబు
ఒండెఁ గైవల్యలక్ష్మివి యొండెనేని
కామసీత్వంబుఁ గైకొన్న కాశిపురివె
యొండె నాఁకొన్నవారల నూఁజడించి
యమృత భిక్షాన్నమిడు విశాలాక్షివీవు.                    43

గీ. చేయఁగలవాఁడ నేను నీ చెప్పినట్లు
బ్రాహ్మణుఁడఁగాన నాకుఁ జాపలముప్రకృతిఁ
బుద్ధిఁగృపసేసి రక్షింపు పుణ్యసాధ్వి
కాంత నీపేరు నాకు నిక్కముగఁజెప్పు.                    44

వ. అనిన నమ్మత్తకాశిని సాత్యవతేయునకిట్లనియె.                    45

శా. ఊఁకో చెప్పఁగ నెంతయేని తడవౌ
నో విప్రశార్దూల నీ

వాఁకొన్నాఁడవు భోజనోత్తరముసం
దాస్థానమైయుండి య
త్తాఁకన్ జెట్టక చెప్పెదన్ సకల వృ
త్తాంతంబునుం దేటగా
వీఁకన్ వేళ యతిక్రమించెఁ గుడువన్
విచ్చేయుమా క్రమ్మఱన్. 46

వ. అనినం బారాశర్యుం డయ్యార్యతో నమ్మహా
త్మునొక్క విన్నపంబుగల దాకర్ణింపుమని యిట్లనియె. 47

ఆ. వె. అయుతసంఖ్యశిష్యు లాఁనూయి వీధుల
వేఱువేఱుభిక్ష వేఁడి తేఱ
నేను నొక్కవీధి నేకాంతవృత్తిమైఁ
బర్యటించి తెత్తుఁ బంచభిక్ష. 48

చ. దినముదినంబుఁ దప్పకిటు
ద్రిమ్మరిచాలఁగభిక్షయెత్తి యేఁ
జను నెడఁగూడవత్తురు కృ
శానుసమానులు నన్నుఁ బైల జై
మినిముఖులైనశిష్యులు స
మిద్ధమతిం బురసూర్యవీధికిన్
మునుకొని యొయ్యనొయ్యఁ
గరముం గరవల్లియనుం బఠించుచున్ .49

గీ. శిష్యులును నేనుగూడి రాజీవనేత్ర
యాశ్రమమున బాషాణమతాంతరమున
రాశివోయుదు మఖిల పాత్రములయందు
నందఱును దెచ్చినట్టి భిక్షాశనంబు. 50

సీ. పాయసాపూప సూప పదార్థనివహంబు
లేకీభవించిన నేర్పరించి
యన్నింటసగ మతిథ్యభ్యాగతార్థంబు
భాజనంబులనించి పాయఁబెట్టి
సగము భాగీరథీసలిల ధారాప్రపూ
రంబునఁ బ్రక్షాళితంబుచేసి
తారతమ్యమున వృద్ధపురస్సరంబుగాఁ
బరిపాటి వేర్వేఱ బంతిసాగి
యర్థి 'సమ్మృతాఽసుతా' మని యనుమతించి
యేను మున్ను ప్రాణాహుతు లెత్తఁజూచి
చేయుఁ బ్రాణాగ్నిహోత్రంబు శిష్యకోటి
యంతయును గాలమీవ్రతంబిట్లు సల్లె. 51

ఉ. ఎన్నఁడుఁ జూడము న్వినము
నిట్టి మహాద్భుత మేమి చెప్పుదుం
గిన్నరకంఠి యొట్టిడిన
కీలునఁ గాశిపురంబునందు భి
క్షాన్నము లేదు నీయుడుగు
లాన నిజంబుగ విన్నవించెదన్
నిన్నటనుండి యేము నిరు
సీఁగియు నుంటిమి నిట్టుపాసముల్. 52

ఉ. చట్టులుడప్పి మైనవుసు
సొరయి పాత్రిలుఁ దాపఁ గాశికా
హట్టములందుఁ గూటికి ను
పాయము లేక పరిభ్రమింప వా

రెట్టరిపోవ నివ్వెనుచు
నించుక యేని యుఁ దాల్మి లేక యే
నెట్లు భుజించువాఁడ ధవ
ళేక్షణ యెక్కడ నీగృహంబునన్. 53

గీ. అ స్తమింపంగఁ జేసినాఁ డహిమకరుఁడు
శిష్యులే కాక యయుతంబుఁ జగుపఁబోఁడి
వ్రతముదప్పి భుజింపంగ వలనుగాదు
నేఁడు నిన్నటి మఱునాఁడు నిక్కువంబు. 54

చ. అనవుడు నల్ల నవ్వి కమ
లాసన యిట్లను లెస్సగాక యో
మునివర నీవు శిష్యగణ
ముంగొని చయ్యనరమ్ము విశ్వనా
థుని కృప పేర్మి నెంద అతి
థుల్ చనుదెంచినఁ గామధేనువుం
బనిగొనునట్లు పెట్టుదు న
పారములైన యభీప్సి తార్థముల్. 55

వ. అనిన నట్లకాక మహాప్రసాదంబని వేదవ్యాసుండు శిష్యులంగూర్చుకొని భాగీరథికింజని యుపస్పర్శం బాచరించి యేతెంచిన. 56

గీ. గొఱుగుపాగలు గిలకలు గులుకరింప
నిందుబింబాస్య యెదురుగా నేగుదెంచి
ఛాత్రసహితంబుగాఁ బరాశరతనూజు
బంతిసాఁగించె భుక్తి శాలాంతరమున. 57

శ్రీ

# ముక్తావళి.



## హరిశ్చంద్రోపాఖ్యానము.

శంకరకవి.



చ. ధరణిప నేఁడు నెల్లియును
దక్కువగా నెలనాళ్ళు సయ్యె, నే
నరసితి లెక్కఁబెట్టి మితి
యాయము లేదొక వీసమైన నే
వెరవుననింక మాఋణము
వేగమె తీర్చెదొ? కాకమిన్న కే
సురిగెదవో? వివేకగుణ
శూన్యతఁబొంది యసత్యవాదివై. 1

క. భూదయిత వినవె "యాల
స్యాదమృతంవిష" మటంచు నార్యజనంబుల్,
మేదిని నెల్లెడఁజెప్పఁ బ్ర
మాదము మిఱిగడచెనేని మానీంద్రునిచేన్. 2

తే. మనుజనాథ వృథా ప్రయోజనమునంచుఁ
దెలియనేరక యూరక దినదినమ్ముఁ

బ్రొద్దుఁ బుచ్చుచు మాయప్పు సుద్దియెల్ల
మఱచియున్నాఁడ విధిభావ్యమా తలంప. 3

చ. ఇఁక మొకమోట మాత్మనొక
యించుక నిల్పక క్రూరవృత్తిఁగొ
శికమునిమీఁద నానయిడి
చెచ్చెఱ నంగడి నడ్డపెట్టి పా
యక బహుబాధలం బొదలు
నట్లుగఁజేయక మాధనంబు రా
దకట నృపాలయిట్లు తగవా ?
ననునిష్ఠురుఁ జేయనేటికిన్. 4

ఉ. ఎంతయు దోషమయ్యె ముని
యెప్పుడు వచ్చునొ, వచ్చినప్పుడేఁ
గొంతయు స్వాపతేయమిదె
కొమ్మని యియ్యకయున్న రోషిత
స్వాంతుఁడగున్ మునీశ్వరుఁడు
సంశయమించుకయైనఁ గల్గదా
కంతువిరోధికిన్ దరము
గాదణఁపంగఁ దదీయకోపమున్. 5

క. పీత జప హోమ నియముఁడ
నై తిరిగియు నిన్నుఁ గూడి యరకాసైనం
జేతికి వచ్చిన యది లే
దీ తుదకుం గినుక వొడమ కెట్లుందు మదిన్. 6

క. ఇదె యిచ్చెద నదె యిచ్చెదఁ
బడ పడ మని యాసఁజూపి పలుతెఱఁగుల నా
హృదయము నొప్పించితి వికఁ
గుదిఁ ద్రోసెద నేఁడు నిన్నుఁ గొంకక యిచటన్. 7

తే. అడను పదసనె కూర్చి మా యప్పు దీర్చి
పొమ్ము నీ వన్నఁ బోమె యీ పోరు మాని
బడలి జీతము పెట్టని బంట నగుచు
వెఱచి నా కేల నీ వెనువెంటఁ దిరుగ. 8

చ. నినుఁ గినియంగఁ జాలక వ
సీధవ గాధితనూజు మానసం
బున కెడ యై లఘుత్వమును
బొందఁగ నేఁటికి నాకు, నీవ నె
మ్మనమున బుద్ధి యూది యొక
మార్గము చేసెద వంచు నుంటి మ
న్ననఁ దొలఁగించి నీ దొరత
నం బుడుపం దడవా తలంపఁగన్. 9

వ. అని యిత్తెఱంగున నక్షత్రకుండు పలుకు నిష్ఠురాలాపంబులు బాణంబులుం బోలె మనోఘాతంబు సేయుటయు నారాజన్యచూడారత్నంబు వ్రీడా దైన్యంబులు ముఖారవిందంబున సందడింప సమంద వ్యాకులత్వంబుం బొంది పుత్రుండును గళత్రంబునుం దక్క తక్కిన విత్తం బణుమాత్రముం గల్గమికిఁ జింతాఘనస్వాంతుండయి చంద్రమతిం గనుంగొని యేమియుం బలుక నేరక యూరక బెట్టునిట్టూర్పులు

నిగుడ్చుచు నానతశిరస్కుండై యుండుటయు నవ్విధంబు నిరీక్షించి యా పురంధ్రీశిరోమణి యింగితాకారభావజ్ఞయు విశేషగుణధుర్యయు సవినయవివేకభాషాచాతుర్యయు నై జీవితేశ్వరుం గనుంగొని, 10

ఉ. నిండిన వేడ్కc లోకములు
నిత్యము సన్నుతిచేయ ధారుణీ
మండల మెల్ల నేలిన స
మగ్రయశోవిభవుండ వీవు, మా
ర్తాండకులేశ మూఘుని వి
ధంబున భ్రాంతివహించి చింతనై
నుండుట పాడిగాదు ధృతి
యుల్లమున న్వికసిల్లc జేయుమా. 11

ఉ. మిక్కిలి దీనతం బొగయ
మీకిది యేటికి నేcడు నెల్లియుం
డక్కువ చూచినన్ మితి ది
నంబు మహీరమణాగ్రగణ్య, యీ
యక్కఱ కేయుపాయమున
నైనను విత్తముగూర్చి కీర్తి సొం
పెక్కcగ మానివర్యు ఋణ
మిప్పుడ తీర్చుట మంచిదారయన్. 12

తే. మోసమగునప్పు దీర్పకయున్న యొక్క
గడియ తడవైన మితిసరి గడచెనేని

క్షితితలేశ్వర నిన్నుఁ బొంకింపఁ బూని
కంకణము గట్టికొన్నాఁడు గాధిపట్టి. 13

చ. పలుమఱు మిమ్ము నివ్వటువు
పాయక యుగ్రతఁ బల్కు నిష్ఠురో
క్తులకు నొకింతయైన మది
దుఃఖముఁ బొందకుఁ డీతఁ డెన్నిభం
గులఁ గడుమానసీయుఁడు త
గున్మన కీతని యాజ్ఞ సేయ నో
జలజసఖాన్వయా ఖరణ
సత్యవచో విభవప్రతిష్ఠకై. 14

తే. వె. పార్థివేశ యడఁచి పాలు ద్రావించిన
చండవిూ మునీంద్ర నందనుండు
కినిసి ఋణము దీర్పుమని మిమ్ము మాటికిఁ
బరుషభాషణములు పలుకుచెల్ల. 15

శా. రూపంబుల్ తగుతోఁటలుం జెఱువులున్
గుళ్ళున్ ధరన్నిల్పఁగా
నేపుణ్యంబొనఁగూడు మర్త్యులకు ధా
త్రీశాన్వయగ్రామణీ
యాపుణ్యంబు రయంబ ప్రాప్తమగు ని
త్యస్ఫూర్తిమై సత్యభా
షాపారీణులకున్ వివేకము మ
దిన్ సంధిల్లనూహించెదన్. 16

తే. అర్థమున కప్పు డొం డుపాయంబులేదు
విసుము ధీరతతో నను విక్రయించి
తీర్పుసగమైన నేఁడు గాధేయు ఋణము
కడమ కొక్క యుపాయంబు గలుగు నెల్లి. 17

చ. అనవుడు నంతరంగమున
సమ్మెలునాటినకంటె దుఃఖము
బ్బిన వెగడొంది భూవిభుఁడు
ప్రేయసిఁ జంద్రమతీ సతీమణిం
గనుఁగొని పల్కె నశ్రువులు
కన్నులఁ గ్రమ్మఁగఁ బద్మగంధియి
ట్లనుచిత రోషభాషణము
లక్కట పల్కఁగ నీకుఁ బాడియే. 18

క. దురితంబుఁ గట్టికొంటివి
హరహర, వినరానియట్టి యతిపురుషవచ
స్ఫుర దగ్ని శిఖలు నాక
ర్ణరంధ్రములఁ జొనిపి నలినదళాక్షీ. 19

చ. ఇలఁ బరికించినన్ బతుల
కెట్టి ప్రయాసముఁ బొందనైనఁ గాం
తలఁ దగు భంగిఁ బ్రోచుటయె
ధర్మము లేమల విక్రయించి యో
జలరుహనేత్ర భర్తలకుఁ
జన్నె సుఖస్థితిఁ జెందియుండఁగా
నలికులవేణు లిందులకు
నంచులకున్ బరభోగ హేతువుల్. 20

క. కులశీల రూప గుణములు
గలిగిన సతిభార్య యగుచుఁ గనుసన్నల ని
చ్చలు మెలఁగనుండు పురుషుని
చెలువము చెలువమ్ము గంధసింధురగమనా!        21

క. సతి నమ్మి బ్రతుకఁబూనెడు
పతికంటెను దోసకారి పరికింపఁగనీ
క్షితిలోన లేఁడు నావుడు
ధృతిమెఱయఁగ నపుడుసాధ్వి నృపునకుననియెన్. 22

ఉ. అంచిత సత్యవాగ్విభవ,
యాపదఁ జెందిన విత్తమెల్ల వ
ర్జించి కులాంగనన్ గరుణఁ
జేకొనఁగాఁ దగు, భార్యనైన ని
ర్వంచన విక్రయించి యని
వార్య వివేక కళాధురీణతా
భ్యంచితవృత్తి భర్తకు ను
పద్రవముంబెడఁ బాయఁగాఁ దగున్. 23

క. భూవర వివరింపఁగ భా
ర్యా విక్రయపాతకంబునైనను బాయం
గావచ్చుఁగాని మఱి మి
థ్యా వాగ్దోషంబుఁ బాయఁ దరమెవ్వరికిన్.     24

తే. అనృతభాషణుకంటె దోషాధికుండు
సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి
వెదకిజూచినఁ బొడమఁ డుర్వీతలేశ
పవనభుజ్గానవామర భువనములను.      25

క. దారసుతాదుల మోహము
గోరెడు వారలకుఁ దగదు కూడఁగనని వి
స్తారమతి సూరిజనములు
ధీరతఁ జన్మోహలతలఁ ద్రెంపుదురనఘా. 26

మ. ప్రతికూలోక్తులు పల్కఁగావలదు భూ
పాలగ్రామణీ, యిట్టిచెన్
ధృతిఁ జిత్తంబున నిల్పి దిగ్భరిత కీ
ర్తిస్ఫూర్తితోఁగూడి సూ
నృత వాక్సంపదఁ బొందు భూజలులు వ
ర్ణింపంగ నామీఁది మో
హాతమఃపుంజముఁ బాపు చిన్మయ వివే
కాదిత్య బింబంబుచేన్. 27

వ. అని దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగుడ్చుటయు నగ్గంధగజగామినిం గనుంగొని వసుందరా వల్లభుం డుల్లంబున నొక్కింత ధైర్యం బవలంబించి యిట్లనియె. 28

తే. ప్రసవకోమలి వినఁనాఁడు భయదమగుచుఁ
బేర్చు కార్చిచ్చు చొరఁగఁ బంపిన విశేష
దోషకారికిఁ గఠినచిత్తునకు నాకు
నిప్పుడీ తెంపుసేయుట యెంతపెద్ద. 29

తే. సకలరాజన్యకన్యకాజనము లపుడు
నీకుఁ బరిచర్యచేయుచు నెమ్మిఁగొలుతు

మత్ప్రేక్షణ యిపుడు నిన్నొక్కరునికి
దాసిగా విక్రయింపఁగఁ జేసెనజుఁడు.　　30

తే. తరుణి నామాట కడు గేఁడు దాఁటవెఱతు
వతివ నామానసమునఁ బాయక వసింతు
వింతి నాకన్న పెన్నిధి వెన్నచూడ
లలన నాపూజ్యసామ్రాజ్య లక్ష్మివీవు.　　31

సీ. మందిరారామ సీమంబులై విలసిల్లు
భయపాటవులు పద్మపత్త్రనయన
కనక హర్మ్యంబులై కనుపట్టు సానువు
ద్గహ్వరాంతరములు సింహమధ్య
పట్టెమంచముమీఁది పఱపులై శోభిల్లుఁ
బూఁదిపానుపులు కర్పూరగంధి
శాల్యోదనంబులై చవులు పుట్టఁగఁ జేయు
శాకపాకాదులు సదమలాంగి

గరిమ నినుఁగూడి చరియించు కతననాకు
నిందుబింబాస్య యిన్నాళ్ళ కిపుడు నేఁడు
పొగడఁ దగు నాదు రాజ్య విభూతులెల్ల
నెరియ నెడఁబాసి పోవుట యెఱుకపడియె.　　32

క. ఏణాక్షీ నిన్నుఁ బాసినఁ
బ్రాణంబులు వాసినట్ల భవదీయగుణా
క్షీణప్రతిభావిభవము
ద్రోణికగా నేఁదరింపుదున్ విపదబ్ధుల్.　　33

మ. అని చింతించుచునున్న భూరమణు దీ
నాకార మీక్షించి య
వ్వని తారత్నము ధైర్య మెంతయు నిజ
స్వాంతంబులో నిల్పి నం
దనుఁడున్ దానును వచ్చి పాదములమీఁ
దన్ వ్రాలి శోకంబునె
క్కొనఁ బల్కెన్ ఘన పుష్ప బిందువులు
దృక్కోణంబునన్ జాఱఁగన్. 34

శా. దీపింపంగ నొనర్తు వెల్లపుడు న
ర్థిన్ మన్మనోమోదముల్
కోపంబంతయుఁ జూపనోడుదువు
పెక్కుల్ నేరముల్ గల్గినన్
నాపూర్వంబగు కర్మమెట్టిదియొ సం
తాపంబు పాలంబడన్
శాపెంద్రైవము నేఁటితో డసను నీ
పాదంబుజద్వంద్వమున్. 35

క. కౌశికసంయమి మాయా
పాశంబులచేతఁగట్టు వడితిమి మదిలో
లేశము ధైర్యము వదలకు
మీశాశ్వతకీర్తి సత్యమేయొసఁగూర్చున్. 36

క. క్షితినాథ 'యతోధర్మ
స్తతో జయ'మటన్న పలుకు సకలపురాణ
స్మృతులు దెలుపంగవిందుము
సతతము సుకృతమ్ము నిలుపు సదమలబుద్ధిన్. 37

శా. శ్రీకంఠుండు పినాకపాణి గిరిపు
          త్రీవల్లభుండార్త ర
క్షాకేళీనిపుణుండు బాలశశిరే
          ఖామౌళి వేదాద్రి సీ
మాకంఠీరవమూర్తి శంకరుఁడు సే
          మంబార సంప్రీతితో
నీకాశీపుర విశ్వనాథుఁడును నీ
          కిచ్చున్ మనోభీష్టముల్.                38

మ. విను నానోముఫలంబునన్ మగుడు నీ
          విశ్వంభరామండలం
బనివార్యస్థిరకీర్తి వైభవుఁడ వై
          యాచంద్రతారార్క మిం
పునఁ బాలించెదు మాని నూనుఁడిపుడీ
          కూర్పరంపు వాక్యంబులా
డెనటంచుం బరితాపమందకుము నీ
          డెందంబు నందేమియున్.                39

క. నీరజ బాంధవుఁ బొదివిన
ధారాధరతతులయట్ల ధరణీధవ నిం
డారగ నిన్నుఁ బొదివిన
భూరివిపత్సముదయములు పోరఁబోరఁ బాయన్.                40

తే. మమ్ము మఱవుము సత్యంబు మఱవకెపుడు
నినుమృషావాదిఁ జేయుదునని చలమున
గాధినందనుఁ డొనరించు కపట కృత్య
ములకుఁ జలనంబు నొందక నిలువుమధిప.                41

శ్రీ

# ముక్తావళి.

## వచనభాగవతము.

### దశమస్కంధము.



### స్యమంతకోపాఖ్యానము.



రాజేంద్రా! సత్రాజితుండు సూర్యుం బరమభక్తి నారాధించి ప్రీతుఁడై వివస్వంతుండు చెలిమినెఱపి యిచ్చిన స్యమంతకంబను రత్నంబును గంఠమున ధరించి ద్వారకకు వచ్చుచుండె. అమ్మణిప్రభల రెండవ సూర్యుండు నా వెలుఁగు నా సత్రాజితుం గాంచి ద్వారకావాసు లమ్మహనీయ తేజంబునఁ జూడ్కులు మిఱుమిట్లుగొన నాతని నుపలక్షింపనేరక ప్రభాకరుండని శంకించి నెత్తమాడుచున్న పురుషోత్తమునొద్ద కరిగి యిట్లనిరి. నారాయణా, శంఖచక్రగదాధరా, దామోదరా, యరవిందాక్షా, గోవిందా, యదునందనా, నీకు నమస్కారము. ఆత్మకిరణ మరీచుల నరలోచనములం గప్పుచు నీతండె యుష్ణకిరణుండు నిన్నుఁ జూడ నేతెంచుచున్నవాఁడు. యదుకులమున గూఢుఁడై యున్న నిన్నుఁ

గనుంగొన సురలు మున్నాల్లోకముల నీమార్గ మన్వేషింతురు గదాయని విన్నవించిన నయ్యభిజ్ఞుల వచనంబువిని హరి నవ్వి "యయ్యా! యీతండు భానుమంతుండుఁ గాఁడు. మత్రి స్యమంతకమణి ప్రభల వెలుంగు సత్రాజితుం" డని తెలియఁజెప్పె.

సత్రాజితుం డట్టియెడ నభినవోత్సవా లంకారభాసురంబై శ్రీమంతంబై యొప్పు నిజగృహంబునకుఁ జని దేవమందిరమున నమ్మణిని విప్రులచే సుప్రవేశితంబుఁ గావించె. అమ్మణి ప్రతిదినము నెనిమిది బారువుల బంగారంబు నీనుచుండు. మఱియు నమ్మహానీయ రత్నంబు పూజించుచోట దుర్భిక్ష మార్యరిష్టంబు లాధివ్యాధులు వంచనలు మున్నగా నే కీడులునుం గలుగవు.

అమ్మణి నుగ్రసేనునకిమ్మని వసజాక్షుం డొక్కనాఁ డడిగిన నర్థలుబ్ధుఁడైన సత్రాజిత్తు హరియడిగెనని యాలోచింపక యియ్యకనిరాకరించె. అంత నొక్కనాఁడు సత్రాజిత్తు ననుజుఁడు ప్రసేనుఁడను వాఁడమ్మణి కంఠమునధరించి గుఱ్ఱమెక్కి వేఁటకై యడవికిఁ జనుటయు నొక్కసింహము ప్రసేనుని దురంగముతోడం గూల్చి యమ్మణింగొని గిరితటమునం బఱచుచుండ జాంబవంతుండా సింహమును సంహరించి మణింగ్రహించుకొని తన గుహకుఁజని యందు దానింగుమారునకుఁ గ్రీడాకందుకంబుగా నొసర్చె.

ఇక్కడ సత్రాజిత్తు తనతమ్మునిరామికి వగచుచు మున్నామణింగోరిన కృష్ణుండే మణితోనరిగిన ప్రసేనుని వధించి గొండవలెనని పలికిన నప్పలుకులువిని జనులొక్కొక్కళ్లతోడ గుజగుజలు వోవుచుండిరి. భగవంతుఁడదివిని తనకుఁగలిగిన వృథాపవాదంబుఁ దొలంగించి కొనంబూని నగరవాసులతోడం బ్రసేనుఁడరిగిన జాడవట్టి చనిచని సింహానిహతుండై గుఱ్ఱముతోడం గూలిన ప్రసేనునిఁ గొండనె త్తమున జాంబవంతునిచేఁ జచ్చిన మృగేంద్రమునుంగాంచి గాఢాంధకార దంతురంబై భయంకరంబై యున్న జాంబవంతుని గుహయొద్దకరిగి గుహద్వారమునం బౌరులనెల్ల నిలిపి తానొక్కరుండ యాగుహలోనికింజొచ్చె.

చొచ్చి యచ్చటబాలునకుఁ గ్రీడా కందుకంబుగాఁ గట్టిన స్యమంతకంబుంగాంచి హరింపనెంచి యర్భకునంతికంబునకుఁ జనుటయు నయ్యపూర్వ పురుషుంగాంచి వాని దాదిబెగ్గడిల్లి యఱచె. అయ్యఱపువిని బలవంతుండైన జాంబవంతుండలుకఁ బెల్లునలేచి తనస్వామి యని ఎఱుంగక తత్ప్రభావం బరయక హరితోడఁబోరికి సమకట్టుటయు నాయుధములను, బాషాణములను, బాదపములను, బాహువులను, బిడుగుపాటునకెనవచ్చు పిడికిటి పోటులను బరస్పర విజిగీషామనీషనొప్పు నప్పరమేశ్వరునకు నాభల్లుకేశ్వరునకును మాంసనిమిత్తమున డేఁగలకుంబోలె నిరువదియెనిమిది దినంబులు ఘోరంబయిన పోరుసెల్లె

అంత గృష్ణ ముష్టిప్రహారమున నంగసంధిబంధంబులు సెదరఁ జెనుటవోడుమం బ్రక్షీణబలుండై జాంబవంతుం డత్యంత విస్మితుండై హరికిట్లనియె. దేవా సర్వభూతములకుఁ బ్రాణమును దేహేంద్రియ హృదయంబులును నీవనియుఁ దెలియుదు. ఆత్ములకుఁ బరమాత్ముఁడవు. ఎవ్వనిరోష రూషిత కటాక్షవీక్షణంబులకు నక్రతిమి తిమింగిలాది జంతువులెల్లఁ గలంగనదరిపడి యుదధి తెరువొసంగ సేతువుఁగట్టి రావణాది రాక్షసుల తలలు దఱిగి కీర్తి పెంపొందించె నా నాదైవంబగు శ్రీరాముఁడు నీవయని యిట్లు జాంబవంతుండు యదువర్యుని నారాయణుఁగా నెఱింగి విన్నవించుటయు గోవిందుండు సుఖప్రదంబైన నిజపాణిపల్లవంబున నా భల్లుకపతి గాత్రంబు నిమిరి యోభల్లుకేశ్వరా, యీ మణి నేను హరించితి నని యపవాదంబు వచ్చుటయు దానింబరిహరింప నిమ్మణి నిమిత్తమున నీ బిలంబునకుఁ జనుదెంచితి మని మేఘగంభీరభాషణం బుల నా భక్తశిరోమణికిఁ జెప్పె.

—♦ జాంబవంతుఁడు తనకూఁతును మణితో హరికిచ్చుట ♦—

భగవంతుని వచనంబువిని జాంబవంతుం డాస్యమంతక మణినిఁ గన్యామణియగు తనకూఁతు జాంబవతినిఁ దనతప్పు మన్నింప నుపాయనంబుగా నంబుజోదరునకర్పించి మఱియుం బెక్కుమణులొసంగి పూజించె. హరియారత్నమును గన్యారత్నమును గ్రహించి యాభల్లుకేశ్వరునకుఁ బ్రీతుండై ముక్తి నొసంగె.

అట ముకుందుండు కందరంబు సొచ్చుచు ద్వారమున నిలిపిన పౌరులు పండ్రెండు దినమ్ములమ్మధువైరి రాక వార్చియుండి యప్పటికి నప్పరమపురుషుండు వెడలి రామి కా మహాత్ముండు మడిసియుండ వలయునని యూహించి పరమ శోకార్తులై మగిడి ద్వారవతికిఁ జని తద్వృత్తాంతము చెప్పిన విని దేవకీదేవియు రుక్మిణియు వసుదేవుఁడును సుహృదులును స్వజనులును కృష్ణుండు బిలంబు వెడలిరాకుండుటకు శోకించుచు సత్రాజితుం దిట్టుచుఁ గృష్ణప్రాప్తిం గోరి చంద్రభాగయను దుర్గాదేవిం గొలిచిరి. వారి కొలువునకు మెచ్చి యద్దేవి దామోదరుండు రయమున వచ్చునని చెప్పె.

అంతలోనం గృష్ణుండు స్యమంతక రత్నంబును జాంబవతీనామ కన్యకారత్నంబునుం గొని ద్వారవతిం జేరుటయు మణి కన్యామణి సమన్వితుండై యేతెంచిన గోవిందుం గనుం గొని దేవకి రుక్మిణీ వసుదేవాదులు చచ్చినయాతండు బ్రతికి వచ్చిన నెట్టులట్టులు పరమాశ్చర్య సంతోషంబుల నుల్లసిల్లిరి.

అట భగవంతుఁడు రాజసభకు సత్రాజిత్తును రావించి మణివృత్తాంత మెల్ల వివరించి యెల్లవారుం జూడ నా స్యమంతకమణి నా సత్రాజిత్తున కొసంగె. ఆతండుఁ దన యపచారంబునకుఁ గొందలం బందుచు సిగ్గుపడి తలవాంచి మణిం గ్రహించి నిజగృహంబునకుఁ జనియె. భగవంతుఁడు జాంబవతిని భార్యఁగా యథోక్తవిధానమునం బరిగ్రహించె.

## —♦ శ్రీకృష్ణుఁడు సత్యభామను బెండ్లియగుట ♦—

అట్లు నిజగృహంబునకుఁ జని సత్రాజితుండు కృష్ణునకుఁ దానొనర్చిన యపచారంబే చింతించుచు బలవద్విరోధంబు నకు భీతిల్లి "యక్కటా! నాతప్పిదం బెట్లులఁ గడిగికొందు నచ్యుతుం డెట్లు ప్రసన్నుండగు నేమిచేసిన నాకు లగ్గగు దేనికి జనులు నన్ను నిందింపకుండుదురు. ద్రవ్యలోభంబున మూఢుండనై క్షుద్రుండనై దీర్ఘాలోచనంబుసేయక యింతకుఁ దెచ్చికొంటి. నా కూఁతురగు సత్యభామయను కన్యారత్నం బును స్యమంతక రత్నంబును గోవిందునకు సమర్పించెద. ఇదియే తగిన యుపాయంబు. ఒండొక్కరీతి దీనికి శాంతి గలుగద"ని తనలో నిశ్చయించి యా సత్రాజిత్తు తనకూఁతు సత్యభామను స్యమంతక మణిం దాన తెచ్చి కృష్ణునకుఁ గానుకగా నర్పించె.

అర్పించుటయు నచ్యుతుండు శీల రూపౌదార్యాది గుణములఁదనరి యంతకుమున్ను పలువురు ప్రార్థింపనెసంగు సత్యభామను విధివిధానంబునఁ బెండిలియై సత్రాజితుంబిలిచి మణియిచ్చి "యయ్యా, నీమణి యేము గోరము. ఇయ్యది సూర్యభక్తుండవైన నీకేయుండుఁగాక, కన్యామణిచాలు నేము ఫలభాక్కులమని చెప్పి యమ్మణిం గ్రమ్మఱ సత్రాజిత్తున కొసంగె.

అట్టియెడఁ బాండవులు కుంతితోడ లాక్షాగృహంబున దగ్ధులైరని విని భగవంతుండు వాస్తవంబు దా నెఱింగి

యున్నను మానుష వేష విడంబనార్థంబు కులోచితవ్యవహారంబు నడప రామునితోఁ గరిపురికిం జని భీష్మ ద్రోణ ధృతరాష్ట్ర విదుర గాంధారులం జూచి సమాన దుఃఖంబున శోకించె. అట్లు రామకృష్ణులు ద్వారకాపురంబున లేని సమయంబుఁ గని యక్రూరుండును గృతవర్మయును శతధన్వు నొద్దకుంజని "సత్రాజిత్తు తన కూఁతును మనకిచ్చునట్లులు చెప్పి కృష్ణునకిచ్చె. కాన స్యమంతకంబుం గొని వాని నాతని తమ్మునొద్దకుం బంపరాద"ని బోధించినం దదుపదేశంబున మతిసెడి శతధన్వుండు పాపాత్ముఁడై క్షీణజీవితుండై రేయి సత్రాజిత్తు సదనంబునకుఁ జని దిక్కుగానక వాని భార్యలాక్రోశింపఁ గటికవాఁడు పశువుంబోలె నిద్రించుచున్న సత్రాజిత్తును లోభమునం జంపి స్యమంతకమణింగొని చనియె.

సత్యభామ హతుఁడైన తండ్రిని గనుంగొని శోకాక్రాంతయై "హా తాత, చెడితి" నని మోహమున విలపించి కొండొకవడికిఁ దనకుఁ దాన యూరడిల్లి పితృకళేబరంబు సెడకుండఁ దైలద్రోణిం బెట్టించి హస్తిపురికరిగి విజ్ఞాతార్థుండైన భగవంతున కాత్మపితృవధంబు నివేదించె. రామకృష్ణులీశ్వరులయ్యు నరలోక విడంబనార్థ "మక్కటా, పరమ కష్టంబ"ని శోకించి సత్యభామతోడ ద్వారక కరుదెంచి శతధన్వుంజంపను నమ్మణిహరింపనుం బూనిరి. తదీయోద్యమం బెఱింగి శతధన్వుండు ప్రాణత్రాణపరుండై కృతవర్మయొద్దకుఁ జని తనకుఁ దోడ్పడుమన నాతం డిట్లనియె.

"అయ్యా! యే నీశ్వరులైన రామకృష్ణులకుం బ్రతికూలంబు సేయను. వారి కపరాధంబుసేసి యెవ్వాండు క్షేమంబునొందు ? వారికలిగి కదా కంసుండు పరిచరులతోడ శ్రీసెడిపొలిసె. జరాసంధుండు పదునేడు పర్యాయంబు లెత్తివచ్చి పోరవిరథుండై యోడె" ననినవిని శతధన్వుం డక్రూరుపాలికరిగి యాగాండిని సుతుండనకుం దోడుపడ వేండుటయు నాతండిట్లనియె. "అయ్యా, యీశ్వరులైన రామకృష్ణుల బలంబెఱింగి యెవ్వాండు వారికిం గీడుపరకుం దెగించు? కృష్ణుండనసామాన్యమానవుండుగాండు. ఈజగంబున కెల్లనిజలీలాయోగమున సృష్టిస్థితి సంహారంబు లాతండు గావించు తదీయమాయామోహితులై యంధులు నావిశ్వపతిచేష్టల నెఱుంగరు. అతండేడేండ్ల బాల్యదశలోనున్నపుడే శిలీంధ్రమునెత్తు నర్భకునిరీతి నొక్కకేల గోవర్ధనగిరినెత్తి ధరించుట వినమే ? అట్టి యద్భుతకర్ముం డనంతుం డాదిభూతుండు కూటస్థుం డాత్ముండు భగవంతుండునగు కృష్ణునకేను బ్రణమిల్లుదు" నని చెప్పి యక్రూరుండు నిరాకరించుటయు శతధన్వుండొండు గతింగానక స్యమంతకమణి నాశ్వఫల్కతనయు నొద్ద దాంపంబెట్టి యొక్కనాంటికి శతయోజనంబులు నడచు నుత్తమహయంబారోహించి రామకృష్ణులకు వెఱచి పఱచె.

పఱచుటయు రామకృష్ణులు గరుడకేతన విభ్రాజితంబైన తేరెక్కి వానిందఱిమిన నాశతధన్వుండు మిథిలానగర

ప్రాంతమునఁ గూలినగుఱ్ఱముఁదొఱంగి యలుకయు వెఱపును గదురఁ బాదచారియై పఱచె. అప్పుడు భగవంతుఁడు చక్రాయుధమున వానితలఁ దఱిగి వస్త్రములలో రత్నము వెదకికానక యన్నసన్నిధి కేతెంచి శతధన్వుండు వృథా హతుండయ్యె. వానియొద్ద మణి గానంబడదని చెప్పినం బలదేవుండు "కృష్ణా, యమ్మణిసీతండు దన కాప్తుఁడైన యొకనియొద్ద దాఁచియుండవలయు, నీవు పురికరిగి విచారింపుము. ఏనుబరమప్రియుండైన వైదేహుంజూడఁబోయెదను" నని చెప్పి మిథిలకుఁ జనియె.

మిథిలేశ్వరుండు వచ్చిన బలభద్రుం బ్రత్యుత్థానాసనాదులఁబూజించి సత్కరించినం బ్రీతుండై హలాయుధుండు మిథిలానగరంబునం గొన్నియేండ్లు వసించె. అప్పుడు దుర్యోధనుండు మిథిలకరిగి జనకునిసమ్మానంబువడసి బలదేవునొద్ద గదాయుద్ధ ప్రకారంబునేర్చె.

కేశవుండుమగిడి ద్వారకకుఁ జనుదెంచి శతధన్వుం జంపుటయు వానియొద్ద మణిలేమియు సత్యభామకుఁ దెలిపి యాప్రియురాలికిఁ బ్రియంబుసేయువాఁడై మృతుఁడైన సత్రాజిత్తునకుఁ బరలోకక్రియలు సుహృత్సమన్వితుండై చేయించె. శతధన్వుచావువిని యక్రూరుఁడును, గృతవర్మయు మణిహరణంబునకుఁ దాము కారణంబై యుండిన కతంబున వెఱచి ద్వారక వెడలి యరిగిరి.

అట నక్రూరుండు ద్వారకవిడిచి చనినకతంబున ద్వారకావాసులకు శారీర మానస దైవిక భౌతిక తాపంబు లొదవెనని కొందఱు పూర్వోదాహృతంబు మఱచి కృష్ణుతోఁ జెప్పిరి. మునిజనావాసుండైన శ్రీనివాసుండు నివసింపఁ బెంపారు ద్వారకలో నక్రూరుండు లేకుండిన దోసంగులు పొసంగుననుట యవివేకి జల్పనంబులకాని ప్రాజ్ఞవచనంబులు గావు. పోసలట్టు లక్రూరుండు లేనిదానం గీడులుమూడె ననియెంచి హరిపాలికిం బోయి "దేవా, తొల్లి కాశీశ్వరుండు తన రాష్ట్రమున వానలు గురియకుండు నెడశ్వఫల్కుని రావించి గాందినినిచ్చి పెండ్లిచేసిన నా దేశమున వానలు గురిసె. ఆ శ్వఫల్కుని సుతుండైన యక్రూరుండు నంతటి వాఁడమ్మహాత్ముండు సనఁ ద్రెంచినం బ్రజల కుపద్రవంబులు దొలంగు"నని వయోవృద్ధులు విన్నవించినవిని కృష్ణుఁడింతుల కింతయుఁ గంబే కారణంబుగాదు. మఱి స్యమంతకంబు లేమి తత్కారణంబని చెప్పి దూతలం బనిచి యక్రూరుని రావించి సన్మానించి ముచ్చటలు చెప్పి యెల్లవారి చిత్తవృత్తుల నెఱింగిన యమ్ముకుందుండు మందహాసంబు దొలుక నతని కిట్లనియె.

"దానపతీ, శతధన్వుఁడు స్యమంతకమణిని నీయొద్దఁ డాఁపఁబెట్టెనని మున్న యేమెఱుంగుదుము. సత్రాజితుం డపుత్రకుండు గావున నాతని కూఁతులకతనికిఁ బిండోదక దానంబులు నిర్వర్తించి ఋణమును ధనమును విభాగించి

కొన నున్నవారు. అమ్మణివరంబు లాఁతులకు దుర్ధరంబు గావున సువ్రతుండైన నీయొద్దన యారత్నముండుఁగాక. అమ్మణివిషయమ్మున మాయన్న నన్ను లెస్సనమ్మఁడు గావున నోమహాభాగా దానిఁజూపి బాంధవులకు శాంతిఁగావింపుము. సౌవర్ణ వేదికలనెసఁక మెసఁగు నీమఖము లవిచ్ఛిన్నముగ నడచు చుండునే'' యని యడిగిన నక్రూరుండు కృష్ణుని సామవచనముల కుల్లసిల్లి వస్త్రచ్ఛన్నంబైన యాస్యమంతక మణిని సూర్యసమ ప్రభా విభాసితంబైన దానిం గోవిందున కర్పించె.

శ్రీకృష్ణుండా స్యమంతక రత్నమును బాంధవుల కెల్లఁ జూపి యాత్మాపవాదంబుఁ గడిగికొని క్రమ్మఱ నమ్మణి నయ్యక్రూరున కొసంగె. పాపహరంబు మంగళ కరంబు కృష్ణ పీర్యోప బృంహితమునగు నీయాఖ్యానముం బఠించినను విన్నను స్మరించినను నరుండు దుష్కీర్తిని దురితమునుహరించి శాంతింబొందెడు.

—◆ శ్రీకృష్ణుఁడు కాళిందిని పెండ్లియగుట ◆—

అంత నొక్కనాఁడు లాక్షాగృహ దాహంబువలనఁ దప్పి పాండవులు కుంతీ సహితంబుగఁ గుశలముండుట దెలిసి కృష్ణుండు సాత్యకి ప్రముఖులతో నింద్రప్రస్థమునకుం జనినం బాండవులింద్రియములు ప్రాణముంబొలె వచ్చిన యచ్యుతుం గాంచి సానురాగ దరహాస భాసురంబైన వాసు దేవు వదనంబు వీక్షించి మోదంబునం బొదలు చుండఁ బుండరీకాక్షుండు

యుధిష్ఠిరభీమసేనులకుఁ బ్రణామంబుఁ గావించి యర్జునుం గౌఁగి లించికొని తనకుఁ బ్రమొక్కిన నకుల సహదేవుల దీవించి వారర్పించిన యుత్తమాసనంబునఁ గూర్చుండుటయుఁ గ్రొత్త పెండిలి కూఁతురైన ద్రౌపదిసిగ్గు పెల్లున మెల్లమెల్లన నడ తెంచి యుపసర్పించి వినీత వేషంబుతోఁ బ్రణమిల్లె. సాత్య కియు వారికిఁ బ్రణామములు నడపి తదీయ సమ్మానంబు వడసి తనకని నిర్దేశించిన యాసనమున నాసీనుం డయ్యె. తక్కినవారును దగిన యాసనంబులం గూర్చుండిరి.

అటవనజాక్షుండు కుంతి పాలికింబోయి యద్దేవి కెఱఁగి తదీయ ప్రేమార్ద్ర వీక్షణంబుల నాదరంబు వడసి కోడలి తోడఁ గుశల ముండుదురే యని యడుగుటయు నామె నత్తి ప్రేమవిహ్వలత్వంబునం గలిగిన కన్నీటివెల్లు వం జేసి డగ్గుత్తిక వెట్టి పూర్వక్లేశములఁ దలంచుకొనుచుఁ గ్లేశవారణ దర్శనుండైన యాసుదర్శన ధరున కిట్లనియె. "కృష్ణా, స్వజనులైన మమ్ముఁ దలఁచి యక్రూరుని నీవుపంపి నపుడే నాథవంతులైన మాకుఁ గుశలం బొదవె విశ్వమున కెల్ల సుహృదుఁడాత్ముఁడునగు నీకు స్వీయ పరకీయ భ్రాంతి గలుగకున్నను స్మరించువారి క్లేశములనెల్ల వారి మనంబుల నివసించి నిరసింతు" వనుటయు యుధిష్ఠిరుండిట్లనియె.

"తొల్లి నే సుకృతంబు సేసితిమో కాని యోగీశ్వరు లకును జూడ నరిది యగు నధీశ్వరుండైన నీవు కుమతులగు

మాకుఁగానుపించితి" వని ప్రశంసించి యాదరించి ప్రార్థించు టయు వానకాలపు నెలలు కృష్ణుం డింద్రప్రస్థపురవాసులకు నయనానందముఁ గ్రందుకొలుపుచు నందు వసియించె.

అట నొక్కనాఁడు కపికేతన విభ్రాజితంబైన రథ మధిరోహించి గాండీవంబు నక్షయతూణీరములునుం గొని కత్తిళంబుదొడిగి సవ్యసాచి కృష్ణునితో బహుళవ్యాళమృగా కీర్ణంబైన యరణ్యంబుసొచ్చి యందు వ్యాఘ్రసూకరమహిష రురుశరభ గవయఖడ్గ హరిణ శల్యకాదుల వధించుటయు రాజభటులందు భోజ్యములైన వానిం బర్వమునః నుర్వీశు నొద్దకుం గొనిపోయిరి. అర్జునుండు పిపాసార్తుండై కృష్ణుని తోడ యమునకుఁ జనియె. అందుఁ గృష్ణార్జునులాచమించి మధురజలముఁ దనుపారఁ ద్రావి కూర్చుండి యచ్చట సుంద రాంగియైన యొక కన్నియ దిరుగుచుండినం గాంచిరి.

అప్పుడు కృష్ణుని పంపున నర్జునుం డా కోమలిరొయొద్ద కరిగి "కల్యాణీ! నీవెవ్వతె వెవ్వని కూఁతుర వెచ్చటనుండి వచ్చినదాన వేమిసేయం దలంతువు. నిన్నుఁ గాంచఁగఁ బతినన్వేషించు చందంబు దోఁచెడు సర్వంబు దెలియఁజెప్పు" మని యడుగ నా కన్నియ యిట్లనియె. "అయ్యా! నేను సవితృని కూఁతురను. వరదుఁడు వరేణ్యుఁడునగు విష్ణుదేవుం బతిఁగాఁ బడయంగోరి తపంబు సలిపితి. ఆ శ్రీనివాసునిదక్క నొండొక్క పురుషుని వరింపను. అనాథుల కాశ్రయంబైన

యమ్మకుందుఁడు నాయెడఁ బరితోషంబు నొందుఁగాక.
నా పేరు కాళింది. యమునాజలంబునఁ దండ్రి యేర్పఱచిన
గృహంబున నచ్యుత దర్శనంబగునంతకు వసింతు" నని చెప్పిన
నయ్యర్థమెల్ల గుడాకేశుండు హృషీకేశునకుఁ దెల్పుటయుఁ
దదర్థంబెల్ల నెఱింగినవాఁడు గావున వాసుదేవుఁ డా కన్నియను
దేరిపై నిడికొని ధర్మరాజు నొద్దకుఁ జనుదెంచె.

అంతకుమున్ను హరిపాండవులు ప్రార్థింప విశ్వకర్మను
రావించి యింద్రప్రస్థపురంబు సమ్యక్పరిష్కృతంబు గావించి
యందు వారికిఁ బ్రియముగావింప నివసించుచు నర్జునునకుఁ
దేరుగడపి ఖాండవంబగ్నికాహారంబుగా నిప్పించినం దానికిఁ
బ్రీతుండై వీతిహోత్రుం డయ్యర్జునునకు గాండీవంబును,
శ్వేతరథ్యముల నుత్తమరథమును నక్షయతూణీరంబుల
నభేద్య కవచంబును నొసంగె. ఖాండవ దహనమునఁ
దప్పించినందులకు ముదంబంది మయుండు ధర్మజునకత్యంత
విచిత్రంబైన సభనునిర్మించియిచ్చె. అందే దుర్యోధనుండు
స్థలము జలమనియు, జలము స్థలమనియు భ్రమసివాలె.
అవ్విధమునఁ బాండవులకు మేలుగావించుచు నందువసియుంచి
కృష్ణుండు కాళిందిని బడసి యటనాసుహృదుల యను
మోదనంబు ననుజ్ఞయుం బడసి సాత్యకి ప్రముఖులతోడ
మగిడిద్వారవతి కేతెంచి శుభనక్షత్రాది యోగయుక్తంబై
బలవంతంబైన శోభనలగ్నమునం గాళిందినిఁ బెండ్లియై తమ
వారికిఁ బరమానందంబును బరమ మంగళంబు నొడగూర్చెఁ.

—◆ శ్రీకృష్ణుండు మిత్రవింద నాగ్నజితి, భద్ర, లక్షణయను వారలం బెండ్లి యవుట ◆—

అవంతీశ్వరులైన విందానువిందులు దుర్యోధను మతంబనువర్తించి స్వయంవరంబున సరోజనాభునిపైఁ గాఁగ్లిన యాత్మభగినిని వారించుటయుఁ దన మేనత్తయగు రాజాధిదేవికూఁతునైన యామిత్రవిందను గోవిందుండు రాజులందఱుసూడ బలాత్కారమునం గొనిపోయి పెండ్లియయ్యె.

కోసలేశ్వరుండైన నగ్నజితుండను పరమధార్మికుఁడైన రాజు తనకూఁతు నాగ్నజితియనుదానిం దీక్ష్ణశృంగముల యేపున లేఁతులకుఁ జెనకరాక వీరుల వాసనసైతింపని బెట్టిదంబులగు నేడు వృషభముల నిర్జించు శూరునకే యిత్తునని మాటపుట్టించినం బార్థివులెవ్వరు నాయెడ్లను గెలువనోపక మూపడంగి బడయరైరి. వృషభముల గెలిచిన వారికాకన్నియ లభ్యయనివిని భగవంతుండు బహుళసైన్యంబులతోడ నయోధ్యకుఁ జనుటయు నాకోసలపతి ప్రీతుండై ప్రత్యుత్థానాసనార్చనాదుల హరినిసత్కరించె.

నాగ్నజితి రమాపతిం గనుంగొని యితండే నాకుఁ బతిగావలయు నావ్రతంబులును బెద్దల యాశీర్వాదంబులును సత్యములగుచేని యిమ్మహాత్మునకు నిక్కంబ పత్నినవుదునని తనలోఁ దలపోయుచుండె.

అట్లు నగ్నజిత్తు పురుషోత్తముం బూజించి "నారాయణ, జగత్పతీ, యాత్మానందపరిపూర్ణుండైన నీకల్పకుండైన

నేనేమి సేయఁజాలుదు? ఎవ్వనిపాద పరాగముం బ్రహ్మరుద్ర లోకపాలకులు నిందిరయు శిరంబులందాల్తు రెవ్వండు దనసృజించిన ధర్మమర్యాదల రక్షింప లీలావతారంబెత్తు నాభగవంతుండేమి యొనర్చిన నాయెడఁ బరితోషంబు నొందు" నని విన్నవించిన నాసీనుండై వాసుదేవుండు లేనగవుదొలఁక మేఘగంభీర స్వనంబున నాతనికిట్లనియె, "నరేంద్రా, స్వధర్మవర్తియగు రాజన్యునకు యాచనదగదు ఐన నీసౌహృదముఁగోరి నీకూఁతునడిగెద. సుంకమేమిచ్చు వారముగామ" నిన గోసలేశ్వరుండు జగదీశ్వరున కిట్లనియె.

"లోకనాథా శ్రీదేవి నెడఁబాయక నిజాంగమునం దాల్చిన గుణైక ధాముఁడైన నీకుఁగడచిన వరుఁడు నాకన్నియకు మఱియెవ్వఁడు గలుగు? ఐన నేముదొల్లి కన్యకకుఁ దగిన వరుంబడయఁగోరి పురుషుల వీర్యముం బరికింప నొక్క సంకేతంబు సేసితిమి. ఈబలీవర్దంబు లేడును దుర్దాంతంబులై యితరులకుఁ బట్టువడక బెట్టిదంబులై ముట్టినవారిం గిట్టు చుండు. పలువురు రాజకుమారులు వీనింజెనకఁజాలక విఱిగిరి. మాసంకేతమునకు భంగము గలుగకుండ నీవువీనిని గ్రహించితు వేని యీనాకూఁతునకుఁ గోరినవరుండ'' వని విన్నవించె.

వారి సంకేతంబు విని వాసుదేవుండు తత్క్షణంబ తానేడు రూపులై నడికట్టుకట్టి యాబలీవర్దంబుల నేడింటిని నవలీలంబట్టి క్రొవ్వడిపి త్రాడులంగట్టి బాలుఁడు బొమ్మల నాట్టులట్టులీడ్చె. దానికి విస్మితుండై ప్రీతుండై కోసలేశ్వరుండు

దనకూఁతు నర్పించుటయు ననురూపయగు నాగ్నజితిం గృష్ణుండు ప్రతిగ్రహించె. రాజభార్యలును గూఁతునకుఁదగిన పతిదొరకెనని పరమానందంబు నొందిరి. అప్పరమోత్సవంబున శంఖ భేరీ ప్రముఖ వాద్యనాదం బెసంగె. బ్రాహ్మణాశీర్వాదంబులడరె. పురుషులును సుందరులును దివ్యాలంకారముల నుల్లసిల్లిరి. లక్ష ధేనువుల నుత్తమ భూషణ విభూషిత యువతీ సహస్రత్రయమును దొమ్మిదివేల యేనుఁగులను వానికి నూఱింతలుగాఁ దేరులను రథములకు నూఱుమడుంగు లెక్కువగాఁగ గుఱ్ఱములను దురంగంబులకు శతగుణోత్తరంబుగాఁ బాదాతంబు నరణంబుగా నాకోసలేశ్వరుం డొసంగి యల్లునుం గూఁతును నుత్తమ స్యందనమున నెక్కించి బహుళ సైన్యంబు బెరసికొలువ ద్వారకకుఁ బనిచె.

మున్నా బలీవర్దములకోడి విఱిగి పఱచిన రాజులు గొందఱు దెఱువునఁ గృష్ణునడ్డగించుటయు సవ్యసాచి బంధుప్రియకరుండై సింహము క్షుద్రమృగముల నెట్టులట్టులు శరజాలంబున వారలం దఱిమె. అయ్యరణ్యముంగొని సత్యయనంబరఁగు నాగ్నజితిందోడుకొని దేవకీనందనుండు ద్వారవతిసేరి యందాభార్యతోడ నిష్టవిహారముల సుఖించె.

అటమాధవుఁడు దన మేనత్తయగు శ్రుతకీర్తికూఁతురైన భద్రయను కన్నియ నన్నలైన సుదర్శనాది కేకయేశ్వరులొసంగ గ్రహించి పరిణయంబయ్యె.

పదంపడి సర్వలక్షణంబుల నొప్పారు లక్ష్మణ యను మద్రపతి కన్నియను స్వయంవరంబున నందఱకు మీఱి గరుడుఁడు సుధ నెట్టులట్టులుకొని తెచ్చి హరివివాహంబయ్యె. మఱియు నరకుం జంపి యతండు చెఱఁబెట్టిన రాజసుందరుల బహుసహస్ర సంఖ్యావతులఁ బంకజనాభుండు భార్యలఁగాఁ బరిగ్రహించెననిన విని మునీంద్రా! కృష్ణుఁడేల భౌముం బరిమార్చె? ఆనరకుఁడేల రాజసుందరులఁ జెఱఁ బెట్టె? శార్ఙ్గధన్వు శౌర్యంబుఁ దెలియఁ జెప్పుమని యడుగుటయు శుకముని ప్రవరుఁడు పరీక్షిన్నరవరున కిట్లనియె.

—♦ శ్రీకృష్ణుఁడు నరకాసురుం బరిమార్చుట. ♦—

రాజశేఖరా నరకుఁడు వరుణుని ఛత్రంబు నదితి కుండలంబుల నమరుల కావాసంబైన మేరుపర్వతంబులోని మణిపర్వతంబునుహరించి బాధించుచుండునని మహేంద్రుండు సత్యభామాగృహముననున్న కృష్ణునకు విన్నవింప నా భక్త వత్సలుండు సత్యభామతోడ గరుడునిపై నారోహించి గిరి శస్త్రి జలాగ్నివాయుదుర్గముల దుర్గమంబై ఘోరదృఢమురపాశముల సంయతంబైయున్న ప్రాగ్జ్యోతిష పురంబునకుఁజని గదాదండమున గిరులు వ్రచ్చి గిరి దుర్గంబు భేదించియు బాణముల శస్త్రములం బొలియించి శస్త్ర దుర్గంబు రూపుమాపియుఁ జక్రాయుధమున నగ్ని జల వాయు దుర్గములను మురపాశముల నున్మూలించియుఁ బాంచజన్య ఘోషమున యంత్రములను వీరచిత్తములను

విదళించియు గదాప్రయోగమునఁ బ్రాకారంబుఁ బగుల నడచియు నేత్తెఱ నూపుటయుఁ బ్రళయకాలాశనిపాతభీషణం బైన పాంచజన్య ఘోషంబు వినిపంచ శీఘ్రుండై న మురుఁడు నిద్దుర మేల్కాంచి నిజావాసంబైన నీరినుండి లేచి యుగవిగమ సమయసవితృ జ్వాలనజ్వాలికా మాలికల పోలికిం బరమా భీలంబైన త్రిశూలంబుఁగొని పంచముఖముల ముల్లోకంబులం గబళించురీతి భీకరాకారుండై యేతెంచి యురగము గరుడు నెట్టులట్టులు పురుషోత్తముం దలపడి యా శూలముఁ ద్రిప్పి వైనతేయుపై నేసి పంచవక్త్రముల నార్చిన నయ్యార్పు భూనభోంతరంబునను సర్వహరి దంతరాళంబునను బ్రహ్మాండ కటాహంబుననుం బూరటిల్లె.

గరుడుని పయింబడ వచ్చుచున్న యా త్రిశూలము నచ్యుతుండు మార్గణంబుల ముత్తునియలు గావించి వాని వక్త్రములం గాండజాలంబు గుప్పించుటయు మురుఁ డలిగి గడయెత్తి విసరివైచె. పయింబడ వచ్చుచున్న యాతని గదను దన గదాదండమున గదాగ్రజుండు దునిమి చేతులు సాఁచి మార్కొన వచ్చుచున్న యయ్యసురతల లేనింటినిం జక్రాయు ధంబున మధువైరి యవలీలగా నఱికిన నాతండు నీటసఁజమున శిఖరము దెగఁగూలు కొండ వడి విచ్ఛిన్నమస్తకుండై విగతాసుఁడై కూలె.

మురాసురుం డట్లు కూలుటయు వాని కొడుకులు తామ్రుఁ, డంతరిక్షుఁడు, శ్రవణుఁడు, విభావసుఁడు, వసుఁడు,

నభస్వంతుఁ డరుణుఁడను వారేడ్వురును బితృవధమునకు
నలుకయు వగపునుంగదుర నరకుఁడువంపఁ బీఠుఁడను
సేనాపతిం బురస్కరించుకొని కైదువులం బూని యనికినడచి
యంపసోనంగురిసి ఖడ్గ, గదాశక్తి, శూలాది నానాసాధ
నంబులం బరంగించిరి. భగవంతుఁడు శరవర్షమున నాసాధన
ములనెల్లఁ దిలమాత్ర శకలంబులుగాఁగ ఖండించి తలలు
దఱిగియుఁ దొడలునరికియు భుజములఁ దునిమియు మేనులు
సించియు వారినందఱను యమపురికిఁబనిపె. అందులకలిగి
భూపుత్రుండైన నరకుండు క్రోధపరీతుండై సముద్రసంభవం
బులైన మత్తగజంబులతోడఁ దానువెడలి గరుడునిపై
సత్యభామతోడఁ గూర్చుండి సూర్యమండలంబుపై మెఱపు
తోడ మేఘముండిన నెట్లగు నట్టియపూర్వ శోభావిభవంబున
నెగడు భగవంతుని సేనాసమేతుండై మార్కొని యురువ
డించి శతఘ్ని నేయుటయు సైనికయోధులొక్కుమ్మడివాఁడి
తూపుల గుప్పించిరి.

అట గదాగ్రజుండు ఱెక్కలనెసఁగు నిశితశరములేసి
భుజములనఱికియుఁ, దొడలుదునిమియు. మెడలు దఱిగియు,
నొడల్లుసించియు, యోధులఁ జెండాడియు, గుఱ్ఱముల
సమయించియు, నేనుంగులఁ గూల్చియు, సైన్యంబు సంగత
దైన్యంబుగావించి వారియమ్ముల కన్నింటికి మూఁడేసితూపులు
మాఱేసి నుగ్గాడుచున్నంత సుపర్ణుండు ఱెక్కలనడచియు,
ముక్కునఁబొడిచియు, గోళ్లఁజీల్చియు, గజానీకంబుఁ జీకాకు

పఱచినం గరుడుని వాఁడిమికోర్వలేక హతశేషంబులైన దలతావళంబులు మొగదిరిగి పుటికిఁబాఱె.

సైన్యమెల్ల వికలమైనం దాలిమివట్టి బెట్టిదంబున నరకుండు పోరుచు గరుడునిపై శక్తినేసిన మున్నువజ్రాయుధ ప్రహారంబు నరకుఁగొనని యమ్మహాత్ముండు పూదండ తాఁకు నేనుఁ గెట్టులట్టు లాశక్తి ప్రహారమునకుఁ గంపింపకుండె, తనశక్తి వమ్మైనం గినిసి నరకుఁడు శూలమేయ నెత్తుచున్నంత దైత్యాంతకుండు చక్రాయుధంబున గజకుంభ స్థితుండైన యానరకుని శిరంబు దునిమినఁ గిరీటకుండలోల్లసితంబైన తన్మస్తకంబు పుడమి వెలింగించుచుఁ బడుటయు హాహా నినాదంబులతో. దేవర్షి సాధువాదంబులును హరిప్రస్తుతివచనంబులును బుష్పవర్షంబులు నడరె.

## —♦ భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట ♦—

అప్పుడు భూదేవి కృష్ణునొద్దకుఁ జనుదెంచి నరకుం డపహరించిన యదితి కుండలంబులను, వరుణుని గొడుగును, వైజయంతీ వనమాలికను మహామణినిం దెచ్చి యిచ్చి మేరుశిఖర మర్పించి మ్రొక్కి కేలుమోడ్చి భక్తిమయచిత్తంబుతో సర్వదేవ పూజితుండైన యావిశ్వేశ్వరు నిట్లని ప్రస్తుతించె.

దేవదేవేశా, శంఖచక్రగదాధరా, పరమాత్మా, భక్తుల ననుగ్రహింప రూపమును గొన్న నీకు నమస్కారము. పంకజనాభుఁడు, పంకజమాలి, పంకజనేత్రుఁడు, పంకజాంఘ్రి

భగవంతుఁడు, వాసుదేవుఁడు, విష్ణువు పురుషుఁడాదిబీజస్వరూపుఁడు, పూర్ణబోధుఁడజుఁడు, జగజ్జనకుఁడు, బ్రహ్మస్వరూపుఁడనంత శక్తియునగు నీకు మ్రొక్కెదను.

ఆనరకుని కొడుకీ భగదత్తుండు భీతుండై యోభక్తిహరా, నీపాదమూలం బాశ్రయించినవాఁడు. సకలకల్మషహరంబైన భవదీయకరారవిందము వీనిశిరంబుపైనిడి ప్రోవుమని యిట్లుభూదేవి ప్రస్తుతించి ప్రార్థించినం జిత్తగించి పురుషోత్తముం డభయ మొసఁగి సకల సమృద్ధి సంపన్నంబైన భౌమ సదనంబుసొచ్చె.

## —• శ్రీకృష్ణుండు పారిజాతంబు భూమికిఁదెచ్చుట •—

అట్లు నరకాసురు నగరుసొచ్చి యచ్యుతుండందు భౌముఁడు విక్రమించి తెచ్చిన పదునాఱువేవురు రాజకన్యకలంగనుంగొనుటయు వారువచ్చిన వనజాక్షు రూప సౌభాగ్యమున కచ్చెరువంది మోహించి యీతండేమాకుఁ బతిగాధాతయనుగ్రహించుఁగాకనిదైవప్రార్థ నంబొనర్చుచు నేకచిత్తమునం గృష్ణునిపతిగా వరించిరి. వారి యభిప్రాయంబెఱింగి వారిజోదరుండా సార సాక్షులంబల్లకుల పైనెక్కించి ద్వారవతికిఁబంపె.

మఱియు నరకుని నగరముననున్న మహాకోశముల నుత్తమరథాశ్వముల నపరిమిత ధనంబునైరావత కులమునం బుట్టిన చతుర్దంతావదాత దంతావళంబుల నఱువదినాలుగింటిని ద్వారకా నగరంబునకుఁ బనిపె. అటనింద్రలోకమును

కరిగి దేవజననియైన యదితికిఁ గుండలంబుల నొసంగి యద్దే
విచే నింద్రుండు నింద్రాణియు సత్కరింపనలరి సత్యభామా
ప్రేరణంబునం దన వనంబులోని పారిజాతంబు పెల్లగించి
గరుడుని మూఁపుపయింబెట్టి యడ్డగించి పోరికి యింద్రాది
నిర్జరుల నిర్జించి నెత్తావికి మూగుచు దేవలోకపుఁదేంట్లు
వెంటరాఁగ నా కల్పపాదపము నవనికిఁదెచ్చి ద్వారవతిసేరి
యందు సత్యభామయింటి పూఁదోఁటలోనాటె. కిరీటకోటులు
పాదముల సోఁకఁబాదాభి వందనం బాచరించి యచ్యుతు
నాత్మార్థంబు ప్రార్థించుసురలు నప్పరమేశ్వరు వలన నభిమతం
బులు వడసియటఁ గలహింతురక్కటా యమరుల యాశ్వ
త్వంబు నింద్యంబు వారికిఁ దమోగుణంబుగలిగె.

అట్లు ద్వారవతీ నగరంబుసేరి వారిజలోచనుండా పదు
నాఱు వేవురు రాజకన్యకలనుం బ్రత్యేకంబు వారివారికిఁ
దగిన గృహంబులనునిచి యందఱకుఁ దానన్నిరూపులై యేక
కాలంబునఁ దానెల్లవారిం బెండ్లియై సామ్యాతిశయ రహితంబు
లైన యా గృహంబులందు వారితో నెడఁబాయక తన
యొద్దనే యున్నవాఁడని యెల్లవారికిం దోపంజేయుచు
నచింతనీయ విలాసనంబులు సూపుచు రమాంశభూతలైన
యానాతులతోడ నాత్మానంద పరిపూర్ణుండయ్యు సాధారణ
గృహస్థునిరీతి గృహమేధి ధర్మము లాచరింపుచుఁ గ్రీడించు
చుండె.

బ్రహ్మాదులు నెవ్వనిపదవిం దెలియరట్టి శ్రీపతింబతిగా
బడసిన యారాజకన్య లప్పటప్పటికిం బెచ్చుపెరుగు కూరిమిని

పేరిమిం గోమరారు లేనగవులను సొంపారుచూపులను మధుర భాషణంబులను లజ్జావిలాస చేష్టితంబుల నింపుపొంపిరివోవం దమకు వేఱువేఱ యూడిగంబులు సేయుచున్న నగాతేసిపరిచారికల నాక్కైటభారి కుపచారము లొనర్పఁబంచి తారు నెదుర్కొనియు నాదరము వెలుపునుంగదుర నాసనంబువెట్టియుఁ గాళ్లుఁగడిగియు విడియమిచ్చియు నడుగులొత్తియు వీవనల వీచియుఁ జందనమలందియుఁ బూదండలు ముడిచియు సిగ దువ్వియుఁ బాన్పుసవరించియు జలకమార్చియుఁ గుడువఁ బెట్టియుఁ బలుతెఱంగులఁ దఱితో నుపచారము లొనర్చి చిత్తంబువడసి పరమానందమునం బొదలిరి.

—♦ శ్రీకృష్ణుండు రుక్మిణితో మేలమాడుట ♦—

అంత నొక్కనాఁడు దనసృజించిన ధర్మసేతువులం బ్రోవ యదుకులంబున నవతరించిన విశ్వసృష్టి రక్షాసంహార కరుండైన యయ్యాశ్వగుం డంతఃపురంబునందలి హర్మ్యతలంబున ననేక మణిమయ దీపములనేపారితోరంపు ముత్తెపు సరులు చుట్టసవరింప నింపారుమేల్కట్టుల నొప్పిదంబైన మంచముమీఁదఁ బాలమీఁగడకు సాటివచ్చు వినిర్మల మృదుల హంసతూలికా తల్పమునం గూర్చుండి గవాక్షమార్గ నిర్గతంబులైన యగరు ధూపములయుఁ దుమ్మెదమొత్తముల కామెతసలుపు సంఫుల్లమల్లికా కుసుమంబులయు విశేషించి శిశిర మారుతాంకురాందోళనంబున వీతెంచు నుద్యానపారిజాతనూతన ప్రసూనంబులయు నెత్తావిమెచ్చుచు సోరణగండ్ల

సుమలఁజొరబారు వెన్నెలచలువ కలయుచు సఖీసమన్వితయై రుక్మిణీదేవి పచరించుచుఁ జెలిచేతివీవనఁ దానుగొని మెల్ల మెల్లనవీవ ముదమునం బొదలుచు మణినూపురంబులును వలయంబులును మ్రోయఁ బయ్యెదలోని పయోధరముల కుంకుమంపుఁ బూఁతలఁ గెంపువాఱిన హారముల కాంతులు నితంబబింబముపయి నెగడు మొలనూలి మణుల కిరణంబులునుం బెరయ నంగుళీయ రత్నరుచులు గ్రమ్మిన కరాగ్రమునం గనకదండ మండితంబైన సితచామరంబుఁగొని వీచుచు నలక కుండల నిష్కకంఠహార సతతప్రభల నెసఁగు వదనమ్మున మందహాస సుధామరీచులింపార దర్శనీయయై లీలావతారంబులెత్తు దన కనురూపంబులైన రూపములెత్తి కొలుచుచున్న రమానురూపయగు నా రుక్మిణీదేవికిఁ బ్రేతుండై నవ్వుచు యదువల్లభుం డిట్లనియె.

"రాజపుత్త్రీ! లోకపాలుర యైశ్వర్యమున నేపారి శ్రీమంతులై రూపౌదార్యగుణముల వాసికెక్కిన మహానుభావులైన రాజులు పెక్కండ్రు నిన్నుఁ గోరిరి. మీతండ్రియు నన్నయు నట్టివారికి నిన్నొసఁగ నిశ్చయించిరి. కోరి వచ్చిన శిశుపాలాదుల విసర్జించిసరిగాని మమ్ము వరించితివి. రాజులకు వెఱచి బలవంతులతోడం బగవాటించి సముద్రమునాశ్రయించిన మమ్ము రాజ్యాసనమున కనర్హులైన వారిని వరింపఁ బోలునే? అవిజ్ఞాతాచారుల లోకమార్గగతులు నగువారిం బొందిన స్త్రీలు ప్రాయికంబుగ నడుమఁగు నుతులు. ఏ మకించ

షులమకించనులకుం బ్రియులము. ఆఢ్యులు నన్ను భజింపరు.
విత్తము కులమైశ్వర్య మాకృతియు నెవ్వరికిఁ దుల్యంబులై
యుండు నట్టివారికే వివాహమును స్నేహమును జెల్లుఁగాని
యుత్తమాధముల కెందునుం జెల్లదు. వైదర్భీ! యింత
విచారింపక దీర్ఘాలోచనంబు సేయక గుణహీనులు భిక్షు
సమ్మానితులు నగు మమ్ము వరించితివి. ఇఁకనైన నీకుఁ దగిన
యుత్తమ పురుషుం బొందుము. దాన నిఁకనైన నుభయ
లోకము లందును సర్వకామములం బడయుదువు. నాయెడ
వైరముసేయు చైద్యసాల్వ జరాసంధ దంతవక్త్రాది పార్థి
వులకును నీయన్నయగు రుక్మికిని గర్వము నడంప వారి నెల్ల
నిర్జించి నిన్నుఁ దెచ్చితి, ఏముదాసీనులము కాని స్త్రీపుత్రార్థ
కాముకులము గాము. జ్యోతిస్స్వరూపులైన క్రియా రహితులమై
యాత్మ లాభమునం బరిపూర్ణులమై యుండుదు” మని యిట్లు
భగవంతుఁడు రుక్మిణికిఁ దానెప్పుడుం బ్రియుని గాయని
వాల్లభ్యమున వెలయుదానను మదంబు మసఁ జెప్పి చాలించె.

ఆత్మ ప్రియుండైన త్రిభువనేశ్వరుండు పలికిన యయ్యా
ప్రియ వచనముల మున్నెన్నఁడును విననిదాని నాకర్ణించి
రుక్మిణి మదిఁ జింతపెల్లున వడఁకుచుఁ బలవించుచుఁ గోమల
పద నఖాగ్రంబున నేల గీఱుచుఁ గాటుక గ్రమ్మిన కన్నీళులఁ
గుంకుమ సంకలిత కుచములఁ దడుపుచు దుఃఖావేగమున
మాటలుడిగి తలవాంచి మతిసెడి చేతివీవన జారిపడ సిగముడి
వీడి పెన్నెఱులు సెదరఁ దెలివిదప్పి గాలికిఁగూలు నరఁటి
క్రమానిర్భీతి నేలంబడియెను.

హాస్యప్రౌఢి యెఱుఁగని ప్రేయసి ప్రేమాతిశయంబుఁ
గని కరుణించి కృష్ణుండు తటాలునఁ బాన్పుడిగి యాకోమ
లాంగిని లేవనెత్తి సిగముడి సవరించి తన కరారవిందమ్మున
నెమ్మొగమ్ము నిమిరి కన్నుఁగవను జన్నుఁగవనుం గమ్మియున్న
కన్నీళులు దుడిచి కౌఁగిటం గ్రుచ్చి మేలంబుల చమత్కార
మరయక దైన్యముం బ్రాపించిన యనన్య విషయయగు
నమ్ముగుద నూఱడించుచు సాధువత్సలుండైన శ్రీవత్స
లాంఛనుం డిట్లనియె.

"వైదర్భీ! నాపై ననూయపడవలదు. నీవు నన్నే
పరాయణంబని నమ్మినదానవని యేనెఱుంగుదు. ప్రణయ
కలహమునం బొమముడిపాటులతోఁ బెదవు లదరఁ గుటిల
వీక్షణంబున నొప్పు నీవదనంబు సూడను దదుచితంబులైన
నీపలుకులు విననుం గోరి మేలమాడితి. ప్రియలతోడి పరిహా
సములను బుసుపుచ్చుట గృహాసక్తులైన గృహస్థులకుఁ
బరమలాభమనుట యోబిత్తరీ, యెఱుంగవైతి"వని భగ
వంతుఁ డూఱార్చిన నూఱడిల్లి యాఫుల్లాబ్జముఖి యది
పరిహాసవచనంబని యెఱింగి ప్రియుండు దన్ను విడుచునన్న
భయంబువాసి లజ్జాలలితస్మేరకటాక్షవీక్షణమున నధోక్షజు
వదనముం గనుంగొనుచు నప్పురుషోత్తమున కిట్లనియె.

"అరవిందలోచనా, సరిగాని మమ్ము వరించితివని
మీరలు పలికినదిసత్యంబు. భవదైశ్వర్యంబునకు నేనెట్టులు
సరియగుదు? బ్రహ్మాదులగు త్రిపురుషులకు నధీశ్వరుండై నిజ

మహిమంబున వెలయు నీవెక్కడ? అజ్ఞులు గొలువనెసఁగు గుణప్రకృతినైన యేనెక్కడ? రాజతుల్యములైన గుణంబులకు వెఱపునంబోలె నగాధసాగరంబున నిశ్చలుండవై చైతన్యఘనుండవై యాత్మస్వరూపుఁడవై వెలయుదువనుట నిక్కువంబు. కుత్సితేంద్రియనిరోధంబుగడించి నీసేవకులేదూరమునఁ బరిత్యజించిన తమోంధమగు రాజ్యపదముఁ ద్యజించుటయు సత్యంబు. భవదీయ పాదపద్మ మకరందముఁ గ్రోలు మునులకును నీగతియగోచరంబన్న నరపశువుల కెఱుంగఁబోలునే?"

"ఆధ్యులమని క్రొవ్విన యింద్రియప్రియు లంతకాకారుండైన నిన్నెఱుంగరు. లోక పూజితులైన యాబ్రహ్మాదులకు నీవు ప్రియుండవు. వారును నీకుఁబ్రియులు. సమస్తపురుషార్థమయుండైన పరమాత్మవునీవు. సన్న్యాసులు నీమహానుభావముఁ గొనియాడుదురనియు జగంబుల కాత్మఁజాత్మప్రియుఁడనియునిన్ను వరించితి. శార్ఙ్గచాప ఘోషమాత్రముననే జరాసంధాది రాజులనోడించి పసులఁదోలి సింహమాత్రబలింగొను విధమున నాత్మభాగమైననన్నుఁగొన్న నీవారాజులకువెఱచి సముద్రమధ్యమున డాఁగితివనుటపొసఁగనిమాట. నిన్నుఁ గోరి లోకాధిపత్యంబైన సామ్రాజ్యము విసర్జించి నీమార్గము నాశ్రయించిన యంగుఁడు, పృథుఁడు, భరతుఁడు, యయాతి, గయుఁడు, మున్నగురాజులు కీడు వొందిరే? అంబుజాక్షా, కొందఱకుఁ గొందఱయెడ రాగంబు గలుగుటయు నీవచించినట్టుల నిక్కంబు. భీష్ముఁడు హరించిన కాశీ

రాజకన్యలలో నంబయనునది లాంత్రిని వరింపదే? పెండ్లి యయ్యు స్వైరిణి క్రొత్తక్రొత్త పురుషులం గోరుచుండు. బుధునకట్టి దానిని భరించు టొప్పదు. భరించిన నాతం డుభయలోకములకుం దప్పు" నని విన్నవించిన నాకర్ణించి భగవంతుండు రుక్మిణి కిట్లనియె.

" మానినీ, నీయట్టి ప్రేమాస్పదంబైన గృహిణిని నేనుజూడను వివాహకాలమునం గూడిన రాజులనెల్ల నిరాకరించి యితరులకుం దెలియకుండ నాకు సందేశముం జెప్ప విప్రునంపితివిగదా. అన్నకు వైరూప్యము గావించుటయు ననిరుద్ధవివాహమునం జూదమాడు నెడ నాతనిం జంపుటయుం బొడమిన శోకమునెల్ల నస్మద్వియోగ భయమున సైరించి యింతకు నవ్విషయమున నొక మాటయైనం బలుకవు. దాన నేము నీకు నిర్జితులమైతిమి. నీ పెండిలియప్పు డేను రాను దడవగుటయు నీవు రయమున రాకుండిన ననన్య యోగ్యంబైన యీ మేను విడుతునని యా విప్రదూత మూలమునం జెప్పి పుత్తెంచిన మాటకేము మిక్కిలి సంత సింతు" మని యిట్లు పరిహాససల్లాపముల రుక్మిణీదేవి యుల్లంబున నుల్లాసంబు పల్లవింపంజేయుచు నా యదువల్ల భుండు నరలోక విడంబనంబు సేయుచుండె మఱియు లోకగురుండైన హరి తక్కిన భార్యల గృహంబులందు నుచిత విధమునం గృహస్థ ధర్మంబులు నడపుచు నా పడంతు లకుం జిత్తరంజనంబుం గావించుచుండె.

## —♦ శ్రీకృష్ణ సంతానోత్పత్తి వర్ణనము ♦—

అవ్విధంబున నా భార్యలతోడ గృహస్థధర్మంబు నడపుచున్న మాయామానుష వేషధరుండైన కృష్ణున కొక్కొక్క భార్యయందుఁ బ్రత్యేకంబు పదుగురు పదుగురు సుతు లుదయించిరి. అత్తెఱంగున నత్తెఱవలు ముకుందుని బలిఁగాఁబడసి యందఱు కన్నిరూపులై సమానానురాగంబు నేపారఁజూపుచున్న యన్నరసఖుని తత్త్వంబెఱుంగక తనకే పతిప్రియుండు వశుండునని యెల్లవారు నుల్లంబులఁ దలంచి కొనుచు వలపునంబొలుపారు మెలపు చూడ్కులను వాతెఱ కెంపుతోడంగలసి పాటలలత్వంబువహించిన లేనగవుమెఱుఁగు లను నమ్ముకుందుఁ జొక్కఁజేఁబూనియు నమ్మహనీయునకుఁ జిత్తవికారంబు గలిగింపఁజాలక తమకు వేఱువేఱ దాస్యంబు సేయు నూఱుగురు పరిచారికలతోఁ బ్రత్యేకంబు వారలా వారిజనాభున కూడిగంబు సేయుచుఁ దచ్చిత్తంబు వడసి యప్పటప్పటికిఁ బ్రోత్తయగు సంగమంబునఁ గూడినసిగ్గు పెల్లున స్తంభాదివ్యవధానంబున నాదయితుం గాంచుచు నవ్వటాలకుఁ జేతులఁ బ్రియునికన్నుల గప్పియుఁ దదంగజ భంగభీతలై క్లేశాపహంబులైన నప్పురుషోత్తముని నామాంతరంబులఁజెప్పక క్రీడించుచుఁ బలుతెఱంగుల విహరించుచు సుఖించుచుండిరి.

హరిభార్యల కందఱకుంగలిగిన కొడుకుల వివరింప వలయునన్న నశక్యంబు భోజకటక పురంబుననున్న రుక్మి

కూఁతురగు రుక్మవతిం బెండ్లియై ప్రద్యుమ్నుఁ డనిరుద్ధనాము
కుంగనియె. కృష్ణభార్యలు షోడశసహస్రసంఖ్యకు మీఱుటయు
వారిపుత్రులు పౌత్రులు మున్నగువారు కోటిసంఖ్యాకులై
వెలసిరనినవిని మునీంద్రా, రుక్మి తనశత్రునకుం బుత్రుండైన
ప్రద్యుమ్నునకుఁ దానెట్లు కూఁతునిచ్చె? అతండు కృష్ణుని
వలనఁ బరిభవంబువడసి యయ్యదువర్యుంజంప సందువెదకు
చుండెఁగదా. పగవారి పెండ్లివృత్తాంత మెఱింగింపుమని
యడిగిన పరీక్షిత్తునకు శుకముని యిట్లనియె.

## —♦ ప్రద్యుమ్న వివాహము ♦—

రుక్మి కృష్ణునిచే నవమానితుండై యావైరముఁ దల
పోయుచుండియుఁ జెలియలగు రుక్మిణీదేవికిఁ బ్రియము సేయు
వాఁడై మేనల్లుఁడైన ప్రద్యుమ్నునకుఁ దన కూఁతునిచ్చి
పెండ్లిసేయనియ్యకొనియె. రుక్మికూఁతురు రుక్మవతి స్వయం
వరంబున మూర్తిఁగొన్న మన్మథుండైన ప్రద్యుమ్నుని వరిం
చుటయు నారుక్మిణీతనయుం డచ్చటఁ గూడిన రాజులనెల్ల
గెలిచి యాకన్యకం గొనిపోవుటయు నావివాహంబు నడచె.

రుక్మిణి కూఁతురగు చారుమతిని గృతవర్మ పుత్రుం
డైన విశాలాక్షుండు పెండ్లియయ్యె. మఱియు రుక్మి కృష్ణుని
యెడ బద్ధవైరుండయ్యు భగినీ ప్రియంకరుండై తన పౌ
త్రుండైన యనిరుద్ధునకుఁ బౌత్రియైన రోచన యను కన్యను
నొసఁగె, అయ్యనిరుద్ధ వివాహోత్సవంబునకు రుక్మిణీ కేశ
వులును, బలరాముఁడును, ప్రద్యుమ్న సాంబాది కుమారుల

తోడ భోజకటక పురంబునకుఁ నావివాహ ముత్సవో_త్తరంబు గానడచె. వివాహకార్యమెల్ల నెఱవేఱిన పదంపడి పెండ్లికి వచ్చిన కాళింగాది పార్థివులు క్రోవ్విదంబున రుక్మిం బిలిచి యయ్యా, జూదమున బలదేవుంగెలువుమని పలికిన నతండక్ష విద్య దెలియకున్నను బలదేవుని జూదమునకుఁ బిలిచి యాడి తొలుదొలుత రాముఁడొడ్డిన నూఱువేయి పదివేలునను పందెములం గెలచినం గాళింగుఁడు పండ్లు తెఱచి పకపకనవ్వి రాముం బరిహాసించుటయు నారౌహిణేయుండు దానిసైరింపకుండె.

అట రుక్మి లక్షనిష్కంబులు పణముగా నొడ్డి యాడుటయు రాముఁ డయ్యాట గెలిచె. అట్టియెడ రుక్మి కపటముఁబూని యేన గెలిచితినని పలుకుటయు సహజారుణ లోచనుండయిన హలాయుధుండు క్రోధద్విగుణితరక్తాక్షుండై పర్వంబునాఁటి యర్ణవంబువోలె ఘూర్ణిల్లుచు నాడి యట నొడ్డిన పదికోట్లు గెలిచె. అప్పుడును రుక్మి యేన గెలిచితి నిందుసత్యము సదస్యులు సెప్పుదు రనుచున్నంత బలుఁడు ధర్మమున గెలిచె. రుక్మి మాట బొంకని యాకాశవాణి వినిపించినను దానిం గొనక రుక్మి దుష్టరాజన్యులు పురికొల్ప నేచి కాలచోదితుండై సంకర్షణుం బరిహాసించుచు నిట్లనియె. "అయ్యా! మీరడవులఁ దిరుగు గోపాలురకాని యక్షవిద్యా విశారదులు బాణప్రయోగ నిపుణులు నగు రాజన్యులు గార"ని యధిక్షేపించుటయుఁ దన్మతంబనువర్తించు నచ్చటి రాజులును బలదేవుం బరిహాసించిరి.

అందుల కలిగి రాముఁడు పరిఘముఁగొని రుక్మిం జంపి వెఱచిపఱచుచున్న కాళింగుం బది యదుగుల కొలందిలో నెయిదిపట్టుకొని మున్ను పండ్లుదెఱచి నవ్విన తప్పిదంబున కాతనిపండ్లు రాలనడిచి తక్కిన రాజులందఱి కొందఱి తలలఁ దఱిగియుఁ గొందఱి భుజములఁ దునిమియుఁ గొందఱి తొడ లవిఱిచియుఁ జీకాకుపఱచినం జేయునదిలేక హతశేషులువిచ్చి పఱచిరి. బలదేవుఁడు రుక్మిని దెగటార్చినదానికిఁ గృష్ణుండు రుక్మిణీ బలదేవుల ప్రీతికి భంగము వచ్చునని శంకించి యేమియుం బలుకకుండె. అట ననిరుద్ధుని నూతన వధువుతో రథమునఁ గూర్చుండఁ జేసి రామకృష్ణాదు లందఱును ద్వారకకుఁ జనుదెంచిరి.

—♦ ఉషాపరిణయ కథా ప్రారంభము. ♦—

బలిపుత్రశతంబులోనం బెద్దయగు బాణాసురుండు తన బాహుసహస్రంబున వాద్యములు వాయించి తాండ వోత్సవంబున నుమాపతి నారాధించి సంప్రీత చేతస్కుండైన యా భక్తవత్సలునివలనం బురపాలకత్వంబు వరంబుగాఁ బడసిన వాఁడొక్కనాఁడు క్రొవ్వి యవ్వాసు నొద్దకుఁజని తపనవర్ణంబైన కిరీటంబు పాదయుగంబు సోఁకనాలోకగురుఁవు నకుఁ బ్రమొక్కి దేవా, యపూర్ణకాములైన పురుషులకు సకల కామంబు లొడఁగూర్పఁ గల్పమహీరుహంబైన నీకు బ్రమొక్కెద. నీ యిచ్చిన బాహుసహస్రంబు మార్కొని పోరువారు లేమిం జేసి నాకు భారమాత్రంబయ్యె. తీఁటవోవఁ బోట్లాడఁ గొండలు బిండిసేయుచు నగ్గలించి దిగ్గజంబులం

చాఁకిననయ్యవి బెగ్గడిల్లిపలుచె నేమిసేయుదుననియనుకొనుటయు నవ్వియవ్వీభుఁ డోరీ మూఢా, నీ పెక్కులయం బెప్పుడు విఱుగు నప్పుడు నీ క్రొవ్వడఁగించువారు నాయట్టివాసితో నీకయ్యేడు నని చెప్పినవిని బాణాసురుండు కుమతియై యందులకు ముదంబంది నిజగృహంబున కేతెంచి మహేశు నాదేశము వార్చియుండె.

వానికూఁతు రుషయనుకన్యక స్వప్నమున నంతకు మున్నెన్నఁడు వినని చూడని యట్టి ప్రద్యుమ్నసుతుండైన యనిరుద్ధునితోడఁ గూడి రతిసుఖముంబడసి యటమేలుకని యాప్రియుంగానక యోకాంతాయని పలుకుచుఁ జెలుల నడుమ లేచి వ్రీడావివ్హలయైయుండె. బాణునిమంత్రికుంభాండుఁ డనువాని కూఁతురు చిత్రలేఖయనునది కుతూహలంబున నుషయొద్దకరిగి, రాజపుత్త్రీ, కాంతునన్వేషింతువు నీమనోరథం బెట్టిది. ఇంతకు నీపాతింగనంబడడని యడిగిన నుష యా చిత్రలేఖ కిట్లనియె.

"చెలీ, నీలగాత్రుఁడు, పీతాంబరుఁడు, పీనాయత బాహుఁడు, కమలలోచనుఁడు, సుందరీ మనోహరుఁడునగు నొకపురుషుని స్వప్నమునంగంటిని అతండు వాతెఱతేనియ లొక్కపరిగ్రోలఁ జనువిచ్చి నన్నువియోగ శోకార్ణవమునం ద్రోచియరిగె. ఆకాంతుని నేనన్వేషింతు" నవిజెప్పుటయుఁ జెలీ, దీనికివగవనేల, నీకుమనోహరుండైన ప్రియుఁడు ముల్లోకములలోపల నెందుండినను నేఁదెత్తుననిపలికి దే

గంధర్వ సిద్ధ చారణ పన్నగ దైత్య విద్యాధర, యక్షుల ప్రతిమలు వ్రాయఁబూని వృష్ణివీరుల లిఖించుచు శూరుని వసుదేవుని రామ కృష్ణులను వ్రాసి ప్రద్యుమ్నుని రూపు వ్రాయుటయు బాణునికూఁతురు సిగ్గుపడియె.

అట ననిరుద్ధుని లిఖించినం జూచి యధోముఖియై మనమునఁ జిరునగవు మిగుల నీతండే నాకలలోఁ గలసిన వాఁడని వచించె. అట యోగనిపుణయగు చిత్రలేఖ యా పురుషుండు పురుషోత్తము పౌత్రుండయిన యనిరుద్ధుఁడని యెఱింగి యాకాశగమనమునఁ గృష్ణ రక్షితంబైన ద్వారకా పురంబునకుఁ జని యందుఁ బాన్పుపయిఁ గూర్కుచున్న యనిరుద్ధుని యోగబలమున బాణరాజధాని యైన శోణిత పురంబునకుఁ గొనివచ్చి యుషకుఁజూపె.

ఆకన్యయు నాసుందరాంగుని గనుంగొని ముదంబంది పురుషులకుఁ జూడనైన యలవిగాని తన యంతఃపుర గృహా మున నయ్యనిరుద్ధునితోడ రమించుచుండె. ప్రియవచనముల నా బాణపుత్రి పరమ ప్రేమాతి శయమునఁ బచరింప నిచ్చ మెత్తుచుఁ జిత్తము దానిపయిం దవులుటయుఁ జేసి కన్యాంతః పురమున గూఢముగ నివసించుచుఁ బెక్కు దినంబులు గడ చుట యెఱుంగఁడయ్యె. కప్పిపెట్టనలవిగాని చిహ్నంబులరసి రాజభటులయ్యుషాకన్యక యనిరుద్ధరతి సుఖాసక్త యగుట యూహించి బాణునొద్దకుఁజని రాజేంద్రా! యేమెల్లవేళల నడఁబాయక పురుషులకుఁ జొరఁగాకుండ నంతి పురంబునకుఁ

గాపోనర్చి యుండినను నీకూఁతు చెయ్వులఁ బరికింపఁ గుల విరుద్ధాచరణంబు నడపునట్లు తోఁచెడు నిందులకుఁ బోలిన కారణము తెలియ నేరమని విన్నవించిరి.

దుహితృ దురాచారంబువిని బాణుఁడు వ్యధితచిత్తుఁడై తత్క్షణంబ కన్యాంతః పురంబునకుఁజని నీలగాత్రంబుపైఁబచ్చని వలువఁగట్టి కుండల కుంతల కాంతులనెసఁగు నెమ్మొగమ్మున జిలునగవు దొలఁకనాత్మ దయితయగునుషా కన్యకతోడనెత్తమాడుచుఁదదీయ కుచకుంకుమరాగ మురమ్మునం గ్రమ్మ మల్లె విరులనెత్తావి పిసాళింప నామోదించుచు నక్కన్నియ యెదురఁ గూర్చున్న త్రిలోకైక సుందరుండైన యనిరుద్ధుఁగాంచి యద్భుతంబందె. మహాభుజుండైన చతుర్భుజ పౌత్రుండు సహస్ర భుజములం గైదువులుపూని యుఱుకవడించుచున్న బాణుంగాంచి మహోర్వపరిఘముంబూని దండధరుండైన యంతకు నాకారమునం బోలిచె.

అంతలో బాణుని సైనికులు పలువురు చుట్టుముట్టి పట్టుకొనంబూనుటయు వరాహము కుక్కలంబోలెఁ బరిఘమున ననిరుద్ధుండడచిన నా సైనికులు గాలుసేతులు దలలు దొడలు దెగంబడిచిరి. అట్లుదన సైన్యము నుఱుమాడుచున్న యన్నారాయణ పౌత్రుని పయింగినిసి బాణుండు నాగపాశముల నాతనింగట్టుటయు శోకవిహ్వాలయై యుషాకన్యక కన్నుఁగవ నశ్రుధారలొలుకదురపిల్లె.

శ్రీ

# ముక్తావళి.

## దశకుమార చరిత్రము - ఉత్తరపీఠిక.

### ద్వితీయాశ్వాసము.



### అపహారవర్మ చరిత్రము.

దేవా! నీవు మహీసురోపకారార్థివై పాతాళ వివరంబుఁ జొచ్చిన సంగడీండ్రందఱు నిను వెదకఁ దలంపున నొక్కొక్క దిక్కునకుంబోవ నేనును భువిఁ ద్రిమ్మరుచు నంగ జనపదంబుల గంగయొడ్డునఁ జెలంగు చంపాపట్టణంబు వెలుపల మహీయుస్తపస్సంపాదిత దివదర్శనుండగు మరీచి యనునొక ఋషిసత్తముండున్నాఁడని జనులాడుకొను మాట విని యతనివలన నీపోవబడిఁ దెలియంగోరి యచ్చోటి కరిగి యయ్యాశ్రమంబున, నొక యెలమావినీడ నుద్విగ్నవర్ణుండై యున్న యొక తపసిం జూచితిని, అతం డతిథికింబోలె నా కుపచరించె. నే నొకక్షణం బచటఁ దెరువు సేదందీర్చికొని యతనితో నిట్లంటిని. ఓ బ్రాహ్మణసత్తమా! పూజ్యుండగు మరీచిమునీంద్రుం డెచట నున్నవాఁడు. ప్రోషితుండైన నా

సంగాతి యునికి నరయవచ్చితిని. అమ్మహర్షి జ్ఞానవిభవం బత్యాశ్చర్యం బని భువినెల్లరుం జెప్పవింటిని. అనిన విని యతండు వేడినిట్టూర్పు నిగిడించి యిట్లనియె.

అట్టిముని యీ యాశ్రమంబున నుండుట నిక్కంబు. ఒకనాఁడు చంపాపురినుండు కామమంజరియను నాగవాసము కన్నిటిఁబొట్టులఁ దొరకితంబైన గుత్తంపుఁ జనుదోయితో మొగంబు మనోగతంబైన నిర్వేదంబు చాటింప నత్తపసికడ కేతెంచి క్రొమ్ముడివిరిసి యిలనెరసికొన మ్రొక్కెను. ఆ క్షణంబునన తల్లిలోనుగాఁ గల తదాప్తవర్గంబు సానుక్రోశం బుగ వెంటనంటి పరువులిడుచు వచ్చి సాగిలంబడియె. అపుడు కృపాళుండు గావున నతండు మృదువచనంబుల నందఱ నూఱ డించి కామమంజరిం గనుంగొని యీ వగపునకు గతంబెద్ది యనవుడు నవ్వెలయాలు లజ్జావిషాద గౌరవంబుల నభిన యించుచు, నో మహానుభావా! యేనిన్నినాళులు విషయ సుఖంబులఁదవిలి యాముష్మికంబుఁ దలఁపక యెడ్డనైచెడితి. ఆర్తిఁజెందినవారి సబహుమానంబుగ స్వీకరించు వ్రతంబుగల నీయడుగుదమ్ములఁ బడినదాన, నన్ను గరుణింపుమనుడు, దానితల్లి యుదంజలియై పలితశార కేశబంధంబు పుడమిం దవులమ్రొక్కి లేచి యిట్లనియె.

అయ్యా దీనికినేఁజేసిన దోషంబు విన్నవించెద. తన యధికారమునకుఁ దగినపనుల ననుష్ఠింపుమని దీనిశిక్షిం చుటయు నాకుఁదప్పైనది. వెలయాలి తల్లి కుచితంబగు

కార్యంబువినుఁడు. కూఁతునకుఁ బుట్టినదిమొదలు స్తైలహారి
ద్రాదులనంగ సంస్కారం బొనర్పవలయు. తేజంబును,
బలంబును జాయయుమేధయుఁ గలిగించునవియును వాతపిత్త
శ్లేష్మ దోషంబులకును జాఠరానలంబుకును వసాసృఙ్మాంస
మేదోస్థి మజ్జాశుక్లంబులను ధాతుసప్తకంబునకును సమత్వం
బొదవించు నవియునునగు నాహారముల మితంబుగ నొసఁగి
యొడలి నోమవలయు. ఐదవయేడు గడిసినపిదపఁ దండ్రి
నేనియుఁ దఱుచుగఁ జూడకుండఁ జేయవలయు. పుట్టిన
నాళులయందును బుణ్యదినములందును మంగళ స్నానాదుల
గావింపించి యుత్సవంబొనర్పవలయు. మఱియుఁ గ్రమక్రమం
బుగసాంగంబుగ ననంగవిద్యం జెప్పించుటయు, నాటలఁ బాటలఁ
జిత్రకర్మముల గంధమాల్యాది క్రియల నక్షరలేఖన వచన
కౌశలంబుల శిక్షింపించుటయు, శబ్దవిద్యయందును హేతు
విద్యయందును, సమయ విద్యయందును వార్తామాత్రంబుఁ
దెలుపుటయు, జీవికా జ్ఞానంబునను క్రీడా కౌశలంబునను.
ద్యూతసమాహ్వయంబులందును, వైదగ్ధ్యంబు నొందించు
టయు, విశ్వసింపఁదగిన వారివలన నభ్యంతర కలావిశేషంబు
లందు జతనంబునఁ బ్రయోగంబు గ్రహించుటయు,
యాత్రోత్సవాదులందు సాదరంబుగ సొమ్ములుఁ బెట్టికై సేసి
యెల్లరకుం జూపుటయు సంగీతాది క్రియాప్రసంగంబుల
నయ్యయి క్రియలఁ బ్రవీణులగువారిలోఁగొని సభల
మెప్పించుటయు, దిఙ్ముఖంబులయందా యా శిల్పజ్ఞుల
వలన యశంబు నెరపుటయు, దైవజ్ఞులు లోనగు

వారిఁగొని కల్యాణ లక్షణంబులఁ బ్రకటింపించుటయుఁ బీఠమర్దవిదూషక విటచేటకధాత్రేయీ ప్రాతివేశిని లింగిని శిల్పివ్యాపుల నాగరకపురుషులు గూడియున్న చోట్లకుఁ బంచి రూపశీలాది ప్రస్తావన సేవించుటయు, గోవాంఛ కోర్కులకుం గుత్తియైన తత్తినెక్కుడగు నోలికిఁ గన్నెఁకంబు వెట్టించుటయు; స్వభావంబుచే రాగాంధునకైనను దాని భావంబులఁ జూచుటచే వేమఱుఁగొన్న వానికైనను గొలంబును. రూపును బ్రాయంబును రొక్కంబును సామర్థ్యంబును శుచిత్వంబును నీగియు మోమోటమియుఁ బనుల నేర్పును శీలంబును బ్రియవక్తృత్వంబునుఁ గలిగి స్వతంత్రుండైన వానికి నొసగుటయు, నట్టిఁడు లభింపనినాఁడు, స్వతంత్రత లేకున్నను గుణంబులమేటియై మిగులఁ బ్రాజ్ఞుఁడగు వానివలన నల్పశుల్కంబు బహువ్యాప దేశంబునఁగొని యర్పించుటయు నొకతఱి స్వతంత్రుండు గాని వానితోడ గాంధర్వసమాగమంబునఁ గూర్చి పిదపఁ దద్వృత్తాంతంబు వాని పెద్దవారికెఱింగించి వారివలన ద్రవ్యంబు గొనుటయు, నెవ్వఁడైనఁ దొలుత గామంబు ననుభవించి పిదప నర్థంబీ సమర్థుఁడు గాకున్న నట్టివాని వరవుఁడుగఁ గొనుటయు, రక్తుండైన నాయకుండబ్బనేని కూఁతుచే నేక చారిణీవ్రతం బనుష్ఠింపించుటయు, నిత్యనైమిత్తికోత్సవ వ్యాజంబున నాయకుల సొమ్ము దఱుచుగ నొడిచికొని హృతశిష్టధనంబు మరియుఁ బెక్కువెరవులఁ నపహరించుటయు లోభియైయీని వానితోఁ గలహించి తొలఁగియుండుటయుఁ, బ్రతిహస్తిని

రేపిదానలుబ్ధుండై రాగవంతుఁడై వానికిఁ ద్యాగశక్తిఁ
బుట్టించుటయు, నసారుండైన వాని నుల్లికుట్టు మాటలను
లోకాపనిందలను గూఁతు నిరోధించుటయు మఱియుఁ బెక్కు
విధంబులఁ బరిభవించి వెడల నడచుటయుఁ, బదంపడి చక్కఁగ
విచారించి యర్థంబియ్యను ననర్థంబులఁ గడవంబెట్టను
సమర్థులై నింద్యులుగాని వారితోఁగూర్చుటయులోనుగాఁగల
కార్యంబులు కర్తవ్యంబులై యున్నయవి.

వెలయాలి కొకనియమం దనురాగంబు నిషిద్ధంబు. ఒకచో నుండినను గన్నపెంచినవారి పంపుమీఱుట ధర్మువు గాదు. ఇట్లుండనీవెంగలి నెలవాళులనుండి విధి విహితంబైన తనధర్మంబు దిగనాడి రూపమాత్ర ధనుండైన యొక విప్ర కుమారునకుఁ గైవసంబై తన సొమ్ము వానికిం బెట్టుచున్న యది. పెక్కండ్రు రొక్కంబుగలవారు పిలిచియుఁ బ్రత్యా ఖ్యాతులై కోపించి యున్నవారు. దీని చెయిదంబునం జేసి కాఁపురంబునకుం గడవమివాటిల్లె. ఈకొఱగామి లగ్గుగాదని నేమాన్ప, గెరలి యడవినుండెదనని యిచ్చటికి వచ్చియున్నది. దీని నిశ్చయంబు తిరంబేని యనన్యగతికులమగు మేమంద ఱము గుడుపునూని యొడలు దొఱంగుదుము.

అనినవిని యమ్ముని కామమంజరింజూచి యోముగ్ధ బాలా! యడవినునికి గొడవఁదెచ్చు దీననపవర్గంబేని స్వర్గం బేనిలేదు. అపవర్గంబు ప్రత్యగ్బ్రహ్మైక్య జ్ఞానము గలుగక చేకూఱదు. మరియునది యందఱకును సాధింప నలవిగాదుఁ

స్వర్గంబు దమతమ కులధర్మంబు ననుష్ఠించుటచే నెల్లవారికి సులభంబుగఁ బడయవచ్చు. కావునఁ గానిపనికిఁబూనుకొనుట మాని నీతల్లి నంపసేయుము. నావుడు నాచానసీ పాద మూలంబు దీననైన నాకు శరణంబు గాకున్న మేనిఁబావకున కర్గంబుఁ జేసెదననియె. నావిని యత్తపసి మదిఁ గొంత చింతించి జరఠం గనుంగొని నీవిపుడింటికిఁ బొమ్ము. కొన్ని దినంబులుఁ బ్రతీక్షింపుము. నీకూఁతు మేను కుసుమ సుకు మారంబు సుఖోపభోగార్హయగు నిది కొంత కాలంబున కడవి వేసటఁ జెందు నేమును నెడనెడ బోధించెదము. దాన నిది తేటి యింటికి వచ్చునని తెలిపిన నట్లకానిమ్మని వేశ్య మాత పనివినియె.

కామమంజరి యామహర్షి నత్యంత భక్తిభావంబున నాశ్రయించి ధౌతవస్త్రద్వయ పరిధానయై శరీర సంస్కా రంబును మిగుల నాదరింపక యయ్యాశ్రమ వనంబుననున్న లేమ్రాఁకుల పాదుల నీర్నించుచు, దేవపూజకై తెచ్చుచుఁ బలుతెగలుగల ఫలంబుల నుపహారంబిడుచు, శివపూజా కాలంబున గంధమాల్యధూప దీపంబులనంది యిచ్చుచు, నృత్యగీతవాద్యాది క్రియల నలుపుచు నేకాంతంబునఁ ద్రివర్గ సంబంధినులగు కథలను నధ్యాత్మ వాదంబులను బ్రొద్దు పుచ్చుచు నల్పకాలంబునన యతవిచిత్తంబు ననురంజించె.

ఒకతఱి మంతనంబున నమ్మునీంద్రుమనంబు రాగ దూషితంబగుట నుపలక్షించి యక్కటా యీ లోకంబెంతటి

మూఢంబో ధర్మంబుతోడ నర్థకామంబులం గణియించెదనని
మొగంబున నించుకనగవు దోఁపనుండిన తరుణింజూచి
యతం డేయంశంబున నర్థకామంబులకంటె ధర్మంబెక్కుడని
తలంచితినని యడిగిన నదిలజ్జామంధర వచనయై యిట్లనియె.

ఓమహాత్మా! ధర్మార్థకామంబుల తారతమ్యంబే నా
నీకుఁ దెలుపు దానను. అయిననిట్లడుగుట యీ దాసిచేస నను
గ్రహ విశేషంబ కాఁదలచెదను. కానిమ్ము వినుము. ధర్మంబు
విడిచి యర్థకామంబులకుఁ బుట్టుకయు కలుగదు. ధర్మంబా
రెంటి బాసటంగోరక యొక్కటి నవృత్తి సుఖంబునకుఁ
గారణంబయి యుండు మఱియు నది మనస్సమాధిమాత్ర
సాధ్యంబు, అర్థకామంబులవలె బాహ్యసాధనంబుల నంత
ప్రసక్తంబుగాదు. తత్త్వదర్శియగువాఁడొక తఱి నర్థకామం
బుల ననుష్టించినను వానిచే బాధ నొందడు. బాధితుండైనను
నల్పాయాసంబున మరల మనస్సమాధానంబు గావించుకొని
యదియ తద్దోషంబునకుఁ బ్రాయశ్చిత్తంబుగా ననల్పం
బైన శ్రేయంబునకు యోగ్యుండగు. తొల్లి సతీ విష్ణుండు
మునిపత్నుల పాతివ్రత్యంబు నవియించె. వెన్నుం డన్నులఁ
బదియారువేల నంతిపురంబునఁ జేర్చికొనియె. విరంచనుండు
తన కూఁతునం దనురక్తుండయ్యె. ఇంద్రుఁడు చీకటితప్పున
నహల్య నెనసె. చందురుండు గురుని మచ్చెకంటికి నంటుకాఁ
డయ్యె. సూర్యుండు బడబాసంగతుండయ్యె. పవనుండు
కేసరికళత్రంబు నధిగమించె. బృహస్పతి యుతథ్యుని కాంత

నాక్రమించె. పరాశరుండు దాశకన్యాదూషణంబుఁ గావించె. వ్యాసుండు భ్రాతృదారలతోడ రమియించె. అత్రి మృగాంగనా సంగతుండయ్యె. మఱియు సురలు పెక్కండ్రు తత్తత్కార్యంబుల నాసురవిప్రలంభన కృత్యంబు లొనరించిరి. జ్ఞానబలంబునం జేసి వారికవి ధర్మపీడాకరంబులుగాకుండె. ధర్మంబుచే నిర్మలంబగు మనంబున నాకసంబునం బోలె నెప్పుడైనను రజంబనుపక్తంబుగాదు. కావున నర్థకామంబులు ధర్మంబు శతతమాంశంబులైనఁ బోలవనితలంచెద నావుడు మునీంద్రుంగని విలాసినీ, తత్త్వజ్ఞులకు విషయోపభోగంబున ధర్మోపరోధంబు కలుగదని నీనోడివిననుడి నిక్కంబ, యేము పుట్టిననాటనుండి యర్థకామంబుల వార్తయైన నెఱుంగము వానిం దెలియవలయు. అవియే రూపుగలవి, వానిసామగ్రి యెద్ది. వానివలన నెట్టిఫలంబు వడయవచ్చునని యడిగిన నవ్వేలఁదియిట్లను.

ఓసంయమిప్రవరా! స్వామ్యునకుఁ గడనయు బెనుపును బ్రోపును రూపంబులు గరిసెంబును బేరంబును బసుల ప్రోపును సంధివిగ్రహాదికంబును బరివారంబు పాత్రమెఱింగి పుడుకుట ఫలంబు. కోర్కికి విషయంబుల నతిసక్తబుద్ధులైన స్త్రీ, పురుషుల నిరతిశయసుఖ స్పర్శవిశేషంబు రూపంబు. లోకమున రమణీయంబులైన భూషణవస్త్ర గంధమాల్యాదికంబులు పరివారంబు పరస్పర విమర్దనంబునంబుట్టెడు పరమానందంబు ఫలంబు. అత్యానందంబు తలంచిన మాత్రన చవియైయుండు మఱియునది యాభిమానికంబై యపరోక్షంబై,

స్వసం వేద్యంబై యుండుదానికొఱకుం బగొప్పవారును గష్టంబు లైన తపంబుల ననుత్తమంబులైన దానంబులను దారుణంబు లైన యుద్ధంబులను భయంకరములైన సముద్ర లంఘనాది కృత్యంబులం గావించెదరు.

అని యిట్లు వెల్లాటకత్తె పలికిన యత్తపసి దైవబలంబు ననో తత్ప్రేరితత్వంబుననో, నిజబుద్ధి మాంద్యంబుననో తన నియమంబుల నాదరింపక, యా వేశ్యయం దనుం బ్రసక్తుం డయ్యె. ఇట్లు మిగులం దెలివి గోల్పడిన యతని నా పడంతి వేల్పుటేట నొక తెప్పంగూర్చుండం బెట్టుకొని దాంటించి చంపానగర రాజమార్గంబున దనయింటికిం గొనిపోయెను. అప్పుడా పట్టణంబున నెల్లి కామోత్సవంబని చాటింపం బడియెను. మునీంద్రుండు ననుపుకొండ నడవడిం జొచ్చి కలనైనం దన యాచారంబును స్మరింపక యాచంచలాక్షి క్షణమాత్రంబు పంచబంగాళమైన మదిం బరితపించుచుం జౌవంచములుకులు గలవాని కగ్గింబై యుండెను. కామోత్సవ దినంబునం గామమంజరి యతనికి స్నానంబుం జేయించి మేనంగలపంబలంది తలవలదిరిగిరా విరులదండంజుట్టి రాజ మార్గంబున నుత్సవ సమాజంబు నొందించి యొక తోటలోం, బెక్కండ్రు బోటులు పరివేష్టింపనున్న రాజునొద్దకుం దోడ్కొనిపోయె. అయ్యెడయుండు మోమునం జిరునగ వొలయునింతీ ! మునివరునితోడం గూర్చుండుమని యానతిచ్చిన నది యట్లుచేయ నయ్యువతీ సమాజంబులోని యొక

యుత్తమాంగన సయ్యన లేచి జేసింజూచి కేల్దోయింగేల్మొక్కి
యో దేవా! యేనుగామమంజరికోడితి నేఁటినుండి దీని
కూడిగంబు సలుపుదానననిప్రణతురాలయ్యె. అప్పుడచ్చటి
జనంబచ్చెరువును హర్షంబును మదిఁ బెచ్చువెరుఁగఁ గల
కలంబులు సలిపిరి. ఏలికయు సంతసించి యవ్వేలయాలికి
నెక్కుడు విలువగల తొడవులను మఱియుం బెక్కు
యోగ్యవస్తునిచయంబును నిచ్చి పంపిన నది పౌరులచేతను
నాగవాసముల చేతను బొగడంబడుచు నింటికింబోవకయ
యుత్తపసింగని యిట్లనియె. ఓమహానుభావా! నీకంజలిఁ
గావించెద. తడవ్రులంబట్టి యీదాసిదెస ననుగ్రహించితిరి.
ఇఁక స్వార్థంబనుష్ఠింతురుగాక! నావ్రుడు నతండు రాగాంధుం
డుగావున నానుడిపిడుగుగతినలయింపనిట్లను. ప్రియురాలా!
యిదేమి? నాదెసనీకేమి కతంబుననిట్టి యుపేక్షకలిగె? అనితర
సాధారణంబైన నీనెనరెందుఁ బోయెను. అని దుర్మనాయ
మానమానసుండై యుండ నవ్వేలంది యతని సస్మితాననయై
చూచి యయ్యా! యీరాజకులంబున నిప్పుడు నావలన
నోటమిఁజెందిన యీబోటికిని నాకును మున్నొకవాదుకలిగె.
అప్పుడిది నన్నుంజూచి మహర్షియగు మరీచిని దపంబువలన
మరల్చి తెచ్చితివేని నిన్నుఁ గొండాడెదననియె నేను దదధి
క్షేపంబు మనంబున శంకుకల్పంబై నాటువడు నోడినవారి
కూడిగంబు పందెంబుగాఁబెట్టి యీపనికిదొరకొంటి. నీయను
గ్రహంబున నాకెలసంబుసెల్లెనని విడికోలు తేటపడంబలికిన
నామర్మతి యనుతాపం బెరసి తనుఁదాన నిందించుకొన్చు

శూన్యప్రాయుండై మరలివచ్చెను. ఆగుబ్బెతచే నిట్టిపాటున వచ్చితిని. ఆమహర్షిని నన్నుఁగాదలంపుము. మొదలుమది నొందవిన ప్రమాదంబులఁ బాపంబుదలంప కేగావించిన పని నాకిప్పుడేవం బుట్టించుచున్నయది. గతముకై చింతిల్లిన నేమగును? ఆబంధకి దనదెసఁదగులంబుగొనిన నాచిత్తంబునఁ గల రాగరజంబూడ్చి యెక్కుడు వైరాగ్యంబు బాదు కొల్పెను. అల్పకాలంబుననయేను నీయర్థంబుసాధింప వలంతి నయ్యెదను. అంతవట్టు నీయంగదేశము రాజధాని వసియింపు మనియె.

అంతనమ్మునివరు మనంబున నుండి జాఱిన తమంబు తన్నంటికొను నోకోయను భయంబునంబోలె హేళి ప్రాచేతస దిశార్ణవంబుఁజొచ్చె. తపసి యుజ్జగించిన రాగంబు మింటు సంజయై చూపట్టె అతని కత నరసి వైరాగ్యంబు నొందిన యదివోలె గమల వనంబులు సంకోచించె. అప్పుడే నాసంయ మీంద్రు నానతి నైకొని యతనితోడ సాంధ్య కృత్యంబులు నిర్వర్తించి యనురూప కథాకథనంబుల నతని నిదుర పుచ్చి యారాత్రిరి నచ్చటన కడపి పొడుపుకొండ చరిఁ బొడమిన యొరగలివోలె సీవుల ప్రూఁని చివురు భాతినడరు నివము. సూడుదేవరవొడమిన నతని కెఱగి వీటికింబోవఁబయనంబైతి.

పోవుతఱిఁ దెసువుచెంత నొక క్షపణ కాలయంబునకు వెలుపల వివిక్తంబైన రక్తాశోక వృక్షంబు క్రింద సమాధి నుడిగి మనోవ్యథచే క్షీణుండై దీన భావంబున శిథిలిత మల

పంకంబైన మొగమునుండి యుగాలు కన్నీట నక్కడఁజియు
మూర్తంబైన శోకంబు చాడ్పుననున్న క్షపణకుఁ గుఱూపి
నొకనింగని యొద్దకుంబోయి కూర్చుండి నీవు తపస్వివైయుండి
ప్రాకృతునివలె నేడ్చు చునికికిం గతంబేమి దాని వినఁదగునేని
తెలుపుమని యడిగితిని. అతండు వేఁడినిట్టూర్పునిగిడించి యి
ట్లనియె. సౌమ్యుఁడా! నావృత్తాంతంబు దెలిపెదవినుము. నేనీ
చంపాపురినుండు నిధిపాలితుండను నొక శెట్టి జ్యేష్ఠపుత్రుండ.
వసుపాలితుండను పేరిటివాఁడ. వైరూప్యంబునం జేసి విరూపక
నామధేయంబును నాకుఁ బ్రసిద్ధంబై యుండు. ఈవీట సుందర
కుండన యథార్థ నామధేయుండగు వేఱొక వణిక్పుత్రుండు
గలండు. అతండు పెక్కు కళలను గుణంబులను బ్రసిద్ధుండు.
రొక్కము మాత్రము వాని కెక్కుడు లేదు. పట్టణంబున
నొండొరులకుఁ దగవులు బెట్టి బ్రతుకు కొందఱు చెనటులు
వానికిని నాకును రూపధనంబుల నిమిత్తంబుగాఁ జేసి వైరం
బుత్పాదించిరి. మరియు నక్కలాట కాండ్రొక్క తఱి నుత్సవ
సమాజంబున మాయిరువురకును వివాదంబుఁ గల్పించిమరలఁ
దార మానావమానాధిక్షేపంబుల నివారించి మమ్ముంగని
మీరేటికి వాదులాడెదరు మేనుగాని, రొక్కంబుగాని, మొగ
తనంబునకు మూలంబు గాదు. ఎవని యౌవనం బుత్తమ
వేశ్యచేఁ బ్రార్థ్యంబై యుండు నతండ పురుషుండు కావున
నీవీట జవరాండ్రకు మేల్బంతియగు కామమంజరి యెవ్వానిఁ
గోరు నతఁ డొరులపరియను బిరుదు నొందెడుంగాక యని

వ్యవస్థాపనంబు గావించిరి. ఏమిరుపురము దాని కోడంబకీ కామమంజరికిం దూతలం బంపితిమి. అది నన్నువలచి యొక్కెడఁ గూర్చుండియున్న మా యిద్దరిలోన నా చెంతకుం జనుదెంచి నల్లగల్వపూవుటెత్తులంబోని కడగంటిచూపుల నన్నుంగప్పి సుందరకుని లజ్జావనతవదనుం గావించె. అంత సుభగ పట్టణంబునొందిన యేను నా యక్కయును రొక్కం బును మేనును బ్రాణంబును దానికిఁ గైవసంబు గావించి కొంతకాలంబు కామోప భోగంబులం దనియుచుంటిని.

ఆ దోసకారి క్రమంబున నా ధనంబపహరించి నన్నుఁ గాపీనావశిష్టుం గావించెను. ఏ మందును ? నా బ్రతుకు నగుంబాటుకు లోనయ్యెను. ఊరనుండు పెద్దవాండ్రు నను ధిక్కరింప సాగిరి. వీని నెల్లసైఁప నలవిగామి నీ యాలయం బున నొకమునిం జేరితిని. అతండు మోక్షమార్గం బుప దేశింప విని భోగముచానలం జేసినవారికి క్షపణకత్వంబ మేలైన తెరువును సుకర వేషంబు నగునని నిశ్చయించి శేషించియున్న కచ్చడంబును బుచ్చివైచితిని. ఈ యవస్థకు వచ్చినపిదప సంస్కారంబులేమి నొడల మలపంకం బంటి కొనియున్న యది. ఇది యట్లుండఁ దండసంబునఁ దలనెఱులు పెరికించికొనుదానం గలిగెడు నంగలార్పు దయ్యామెఱుంగు. ఆకటివేళకు గుడుపును నీరువట్టుతరికి జలపానంబొదవమి నా పడెడు నెగులంతింతనరాకున్న యది. క్రొత్తగాబట్టువడిన వృత్తిగతి స్థానాశన శయన భోజనంబుల బట్టి నిర్బంధంబుల

నొందుచు గుందుచున్నవాఁడను. నేను తొలుత ద్విజుండనై పుట్టియు స్వధర్మంబుడిగనాడి వేదబాహ్యుల మతంబుసం దిగితిని. మా పెద్దలు శ్రుతిస్మృతి విహితంబైన మార్గంబునం బ్రవర్తించి సుగతిం బడసిరి. నా దురదృష్టం బిట్టిదై యుండు టంజేసి ప్రబలదుఃఖాకరంబును బ్రహ్మవిష్ణ్వీశ్వరాది దేవతా నిందావాక్యంబు లెడతెగక వినుటంజేసి శరీరపాతానంతరం బునను నిరయంబునకు గారణంబును నిష్ప్రయోజనంబును వంచనాప్రాయంబునగు నీ యధర్మంబు ధర్మ్మువుగా ననుష్ఠింప వలసివచ్చెఁగదాయని నా చెనటి చెయిదంబులం దలంచి కొనుచు వివిక్తంబగు నీ పిండీఖండంబునొంది కంటికిఁ గడవెఁడు నీరుగా వగచుచున్నవాఁడ.

అనిన విని యే నతనికి దయమాన మానసుండనై యో భద్రుఁడా! యీగోరంబు నోర్చుకొని కొంతకాలంబిచ్చట నయుండు మా వేడ్కకత్తె తనధనంబుతో నిన్నుంగూర్చునట్లు తగుజతనంబు సలిపెద. నప్పనికిఁబెక్కు హారువులు గలవని యాఅటంజెప్పి యచ్చటనుండి పట్టణంబుఁ బ్రవేశించితిని. ఆపీటనుండు వారలు తఱుచుగ లోభవంతులని లోకవాదంబు వలన నెఱింగిన వా డఁగావున నర్థంబునకుంగల నశ్వరత్వంబు తేటపడంబలికి వారిఁబ్రకృతిస్థులం జేయఁబూనొకని కర్థిసు తుండు విధించిన తెరువున మతిఁగావించి యొకద్యూతసమా జంబునకుంజని జూదరులతోఁ గలసికొంటిని. అందునాగ టాలఁబాచికల నాశ్రయించిన కలలంగల యిరువదేను

భేదంబులును నక్షభూమి హస్తాదులోరులకుం దెలియనలవి
గాని కపటకార్యంబులును దాని మూలంబుగఁగొని క్రొవ్వున
నొండొరులం దిట్టుకొనుటయుఁ బ్రాణంబులకుం దెగు నంతటి
తొందర పాటునం గలిసి రాకయుఁ దమ తమ న్యాయంబుల
సభికులకుం దెలిపి వారివలనం గర్తవ్యంబు తెలుంగుటయు
బలవంతుల నడిగికొనుటయు దుర్బలులం బెదరించుటయుఁ
బక్షరచనంబుల నేర్పునం నెదిరిఁ బ్రలోభింపఁ జేయుటయుఁ
బందెపు విత్తంబుల వర్ణించుటయు ద్రవ్యంబు పంచియిచ్చు
తెఱంగును నెడ నెడం బూతులజోకి కొనుటయు లోనుగాఁగల
వానిననుభవించినను నాకు మదిఁదృప్తిలేదయ్యె. అత్తరి నొకకిత
వుండు ప్రమాదంబున సారెవ్రేయుఁడు నించుక నవ్వితిని. దానికి
యెదిరియాటకాఁడును కజావాలినచూడ్కి నను దరికొల్పు
గఱింగని యోరీ నవ్వనేపంబున నెత్తమాడు తెఱువు నాకుం
గఱపవచ్చితివి కాఁబోలుఁ గానిమ్ము నేర్పు లేని జూదరియిట్లుండు
గాక. నిపుణుండవైన నీతో నాడెదనని ద్యూతాధ్యక్షుల
యనుమతిం గొని నాతోడ నాడెను. నేను వానితో నక్షదేవ
నంబున పదియాఱువేల దీనారంబులం గెలిచికొని యందు
సగముపాలు సభికునకును సభ్యులకును నొసంగి తక్కిన సగము
గొనిపోవ సమకట్టితిని. అచ్చటివారలు సంతసంబున నన్నుఁ
బ్రశంసించిరి. అప్పుడు సభికుఁడు ప్రార్థింప నాతనియింటఁ
గుడిచితిని. అందేను దురోదరంబునకుం దిగుటకు మూలం
బైన విమర్దకుండనువాఁడు నాకు నచ్చికకుం దగిన రెండవ
హృదయంబయ్యె. వానివలన నాగరకులకలిమియు బలిమియు

స్వభావంబును లోనుగాఁగలవాని సమగ్రంబుగ నరసి ముక్కంటికుత్తుక కటిచాయ ననుకరించు నిరులు లోక చక్షువుల నిరోధించి వఱలుతఱి నీలిచల్లడంబు దొడవి పసును గలకత్తిగైకొని కన్నము గోలయుఁ బుఱుషుని తలయెముకను సొక్కుపొడియు యోగవర్తియుఁ జీకటి కాటుకయుఁ బ్రమిడెయు భ్రమర కరండంబును లోనుగాఁగల పెక్కు పరి కరంబులతోఁ జని యొక్కలుబ్ధధనికుని యింటికిం గన్నంబిడి గవాక్షసూక్ష్మచ్ఛిద్రంబులవలన నంతర్గృహ వృత్తాంతంబెఱింగి యబాధంబుగ స్వగృహంబునుం జొరెఁజొచ్చి సారంబున నెక్కుడగు మూలధనంబునం గైకొని నిర్గమించి నల్లని మొయిళ్ళుగమియపోలెఁ బలిసిన చిమ్మచీకటుల గ్రమ్ముకొనం బడిన రాజమార్గంబున నేగుచు మెఱుంగు మెఱసినట్లొక తుఱంగలిచూపులకు మిఱుమిట్లు గొలుపుచు క్షణమాత్రంబు నిలిచిచూచితి. అంత నగరమోహ రోహితమైన నగరాధి దేవతవోలె మాటుమణఁగియున్న యత్తఱి యొకమత్తకాశిని మేనిరవణంబు లిరుల విరియింప నాయెదురనిల్చిన నేను దానింజూచి నీవెవ్వతె వెచ్చోటికేగెదవని యడిగిన నది యిట్లనియె.

ఓ యార్యుఁడా! యీ పీటఁ గుబేరదత్తుండను నొక కోమటి యున్నవాఁడు. ఏనతని కన్నియ. నాపుట్టినయప్పుడ నన్ను నీతప్పట్టణ వాసియగు ధనమిత్రుండను నొక యాఢ్య కుమారునకు భార్యగా నిత్తునని నా తండ్రి వాకుచ్చె.

ధనమిత్రుండు తనతండ్రి లోకాంతర గతుండైన తరువాతఁ
దద్దయు దేగకాఁడై నిజధనంబుచే నర్థులవలనం గొనఁబడిన
యదియుఁబోలె నొదవిన యెగ్గడి దుర్దశం బెరసె. మఱియు
నతని యీఁగికిం బ్రీతులై జనంబు లుదారకుండను శ్లాఘ్యా
నామంబిడిరి. నాతండ్రి పరువంపుదాననైన నన్నధనుండని
ధనమిత్రున కొసంగక యర్థపతియను సార్థక నామధేయుం
డగు వేఱొక సార్థవాహునకీఁ దలంచి యున్నాడు. ఈయమం
గల మీ రేపకడం గలుగునని యెఱింగి యింతకుమున్న
ధనమిత్రునిచే దత్తసంకేతనై యీనడికిరేయి స్వజనంబును
వంచించి యిలువెడలి చిన్నవాఁడల వఱుపంబడిన తెరువున
మదనసహాయనై మత్ప్రాణేశ్వరు నింటికిం బోయెదఁ గావున
నన్ను విడువుము. ఇదె కొనుమని మేనున్న తొడవు
సడలించి యొసఁగె.

అప్పుడేను దయావిష్టమతినై యోసతీ లలామంబ!
నాతోడరమ్మేను నిన్ను నీపతి గృహంబునకుం జేర్చెదనని పలికి
మూఁడునాలుగడుగులునడిచితి. అంతలోనఁ బెక్కండ్రునాగరి
కులు గుములై పెనుఁగట్టియలుఁ గత్తులు నీటెలు లోనుగాఁగల
సాధనంబులం బూని దివ్వెల వెలుంగులం జీకటి పిండువ్రో
సరిల్లఁ జుట్టికొనిరి. వారింజూచి యప్పడఁతి యళుకున వడ
వడంకసాగె. నేనించుకేని తలంపక యిట్లంటి. ఓ పంకజాక్షీ
భయంపడకుము. వాలుగల నాకేలు నాకు సహాయంబై
యున్నయది. ఖనను నీమనం బదరునను తలంపున నొక

మ్మదూపాయంబుఁ జింతించితి. నేను విషవేగ వికృతిం బొందిన వానివలె నిందు బరుండెద. నీవీ వచ్చిన వారిం గనుంగొని యయ్యలారా! యేము రేయి నీవీటం బ్రవేశించితిమి. ఈసభాసదనంబు మూల దులువ చిలువనా మగనిం గఱచె. మీలో మంత్రం బెఱిగిన వాఁడెవ్వండేని యుండిన నాదయాళుండీతని బ్రతికించి యనాథనైన నా ప్రాణంబుల మరల్పంగావుతమని ప్రార్థింపుము.

నావుడు సుదతి వేఱొండుగతి లేమిఁ బ్రకృతంబున నీస్వత్రియ హితకారిణియని కృతనిశ్చయయై జడుపున నెలుంగు రాల్పడ బాష్పంబులుచూడ్కి నావరింప నంగకంబులు కంపింప నట్టకేలకు వారిడగ్గఱి యేఁ జెప్పినట్ల కావించె. నేనును భావితవిషయ విక్రియుండనై శయనించి యుండితి. అందునొక విషవైద్యాభిమాని నన్ను సమగ్రంబుగ వీక్షించి ముద్రాతంత్రమంత్రధాన్యాది క్రియలం గొంతవట్టు చికిత్సించి కృతార్థుండుగా కర్తగణింజూచి యీతండు గెడసినవాఁడు. మేను స్తబ్ధంబై కాంతిఁదప్పెఁ జూడ్కి నిరుద్ధంబయ్యె. వెచ్చ కాన్పింపదు. ఇఁక శోకింపఁ బనిలేదు. దైవంబుగడవ నేరికిఁ దరంబు. ఎల్లి వీని కగ్నిసంస్కారంబు గావింతమని చెప్పి తనతోడివారలం గూడికొని చనియె.

పిమ్మట నేనులేచి యమ్మెలఁత నుదారకు నొద్దకుం గొనిచని యిట్లంటిని. నేనొక వల్లడికాఁడను. ఈ కన్నియ భవదాయత్తంబు బాసటగా నడికి రేయి నినుఁ జేరవచ్చుచు

మార్గమధ్యంబున నాచేఁ జూడంబడియె. నేనుఁ గనికరం బున దీనిఁ దోడ్కొనివచ్చి నీ కర్పించితిని. అనిచెప్పి నిజ ప్రభాజాలంబున నిరులు విరియింపంజాలు దానితోడవును నర్పించితిని. ఉదారకుండు దానింగొని లజ్జాహర్షసంభ్ర మంబులు మనంబున సందడింప ననుంజూచి యయ్యా! యీరేయి నా ప్రియురాలిని నీవ నా కొసంగి నావాకు నపహరించితివి.

అదెట్లనిన, నీ విషయంబిట్టిదని చెప్ప నా కలవి కాకున్నయది. నీచెయి యద్భుతంబని వక్కాణింతునా. నీ శీలంబును నట్టిదిగనే కన్పట్టుచున్నది. తొల్లి యిట్లు కావించిన వాఁ డెవ్వండును లేఁడనుటయు సముచితంబు కాఁదోపదు. వస్తుశక్తి ప్రతినియతంబకదా పెఱవారియందలి లోభాదిగుణంబులు నీయందుఁ జూపట్టవు. నీచే నిపుడు సాధుత్వంబు వెలయింపఁబడె ననుటయుఁ బ్రౌఢోవాదము. ఇది నీ పూర్వాపదానంబుల కన్న నధికమా. ఔదార్య స్వరూపంబు నిప్పుడు చూచితినని గాని నీయాశయంబుల ఘూకరింపక చెప్పఁజాలను. నీవీ సుకృతంబుచే నీ దాసుం గొంటివన్నను నెక్కుడు వెలకుం గొంటివని నీ ప్రజ్ఞ నధి క్షేపించిన ట్లగును. ప్రేయసీ దానంబునకుం బ్రతిదానం బీశరీరమనుటకును శక్యముగాదు. ప్రియురాలులభింప దేని జగ తిపై మనఁజాలని యీశరీరము పైతము నీవిచ్చినదియుఁగదా! నేఁటిసుత నీదాసుండు నీకు భరింపఁదగిన వాడనుచు నాయడు గులఁ బ్రాలెను.

నేనతని లేవనెత్తి యక్కునంజేర్చి యిపుడు నీవేమి సేయఁదలంచెదవని యడిగితి. దానికి నతం డేను దీనితండ్రి యనుమతిలేక పెండిలియై యిచ్చట బ్రతికియుండ వలంతిని గాను కావున నీ రేయియందు యిచ్చోటుజ్జగించి పోవఁదలంచెద నైననేనొక స్వతంత్రుఁడనె నీయానతిచ్చినట్లు సేయంగల వాఁడఁగాఁక యని ప్రతివచనంబిచ్చెను. నేవానిఁగని చతురిమ గల పురుషునకుఁ దనదేశంబనియును పెఱదేశంబనియును గణనగలుగదు. నీవెలఁత లేఁబ్రాయంబున నున్నది. సుకుమారులకు మిగులఁ గష్టంబులగుటచేఁ గాంతారమార్గంబులు దోషబహుళంబులై యుండు నిష్ప్రయోజనంబైన దేశత్యాగంబునకు దొరకొనుటచే నీప్రజ్ఞాసత్వంబులకుఁ గొంత వైఫల్యంబు గలిగెనని యూహించెదఁ గావున దీనితోఁ గ నిచటన వసించుట నీకుఁ గర్తవ్యంబు. ఇపుడీకన్నియం దీనియిల్లు సేర్పుదమని పలికి యతని సమ్మతింగొని యక్కన్నియను మఱలఁ బితృగృహంబు నొందించి దానివలన నొక వెఱింగి కుబేరదత్తునింటనున్న సొమ్ముల్ల మృద్భాండావశేషంబుగా దొంగిలించి యచటనుండి వెలువడి యొకచోట ముషితకంబుడాఁచి మఱలఁ బురంబుసొచ్చి నాగరిక జనసంపాతంబునఁ దెన్నుకెలన శయనించియున్న యొక మదపుటేనుంగుపై నాధోరణు దిగువంబడఁ ద్రోచి యెక్కితిమి.

ఆగొంపు గ్రైవేయప్రోత పాదయుగళ చాలనంబున క్షేపంబడి పూర్వపాతితాధోరణ విశాలవక్షఃస్థల పరిణతంబై

దంతదండంబును ప్రేవుదీవెలు చుట్టికొన రక్షకబలంబునెల్లఁ
మడిపె. మఱియు నీగజంబుం గొని యర్థపతి భవనంబును
నిర్మూలించి యచటనుండి తొలఁగి యొక జీర్ణోద్యానమున
నొకచెట్టుకొమ్మ నవలంబించి దిగి స్వగృహంబునకుం జని
నీరాడి శయనించితిమి.

అంతలోన నుదయగిరివర సరోజరాగ శిఖరంబువాఁ
బరఁగి యీవులద్రూనికడానిచివురుగతి నెఱ్ఱనై భానుబింబము
చూపట్టె. ఏమిరువురము లేచి ప్రక్షాళితముఖులమై ప్రొద్దుచె
య్వులఁగావించి మాచెద్దుని సంకులంబైన వీటఁ ద్రిమ్మరుచు
వరవధూగృహంబులఁ గలిసిన కలకలంబు వింటిమి. అంత
నర్థపతి యర్థంబులఁ గుబేరదత్తు నాశ్వాసించి యొకమాసం
బునకుఁ గన్నియ వివాహంబగునట్లు లేర్పఱించికొనియె. నేను
మంతనంబున ధనమిత్రునితో నిట్లంటిని. ఓ చెలికాఁడా, రమ్ము
ఏనో సంగెదు నీచర్మరత్నభస్త్రికను బురస్కరించికొని యంగ
రాజు నేకాంతంబునఁ జేరి యిట్లను.

దేవా, పెక్కుకోట్లు రొక్కంబుగల వసుమిత్రుని
కేకపుత్రుండనగు ధనమిత్రుండనువాఁడ. నన్ను నీవెఱింగియే
యుండెదవు. ఏను యాచకులకుం బుడికిపుడికి రొక్కంబెల్లం
బోఁగొట్టికొంటి. కుబేరదత్తుండు నాకొఱకుం బెంచుచున్న
తనకూఁతు నర్థపతికీయ నిశ్చయించి దరిద్రుండని నన్నవ
మానించె. నేనా గోడవ నెడదం బట్టఁజాలక యుసుఱ్జగింప
నిచ్ఛగించి వీటిచెంగటి ప్రాఁదోఁటఁ జేరి కత్తుకఁ గత్తి
నానించికొంటిని.

అప్పుడొక జడదారి నా కగపడి వలదు వలదని నా యుద్యమం బుడిపి యిట్లు సాహసించుటకుఁ గతం బేమని యడిగె. నేను దారిద్ర్య దోషంబునఁ గలిగ యవమానంబున నని సవిస్తరంబుగఁ జెప్పితి. అమ్మహాత్ముండు కృపాళుండు గావున సానుగ్రహంబుగ నన్నుంజూచి తండ్రీ యెంతటి యెడ్డెవు. ఆత్మత్యాగంబుకంటెఁ బాపిష్ఠతమం బొకండు లేదు. మేను వలంపకయ బుద్ధిమంతులు తమ్ముందామ కాపాడికొని యెదరు. రొక్కంబు గడింప మారుపులు పెక్కు గలవు. కోసి కొన్న కత్తుక మఱలఁ దవిలించి ప్రాణముల మఱల్పుకొను నుపాయంబు మాత్ర మొకంఁడును లేదు. దీనిచే నీకుఁ బ్రయోజనం బేమి? ఏను మంత్ర సిద్ధుండ. లక్ష్మీగ్రాహిణియైన చర్మభస్త్రిక నతిప్రయత్నంబునఁ బడసితిని. తడవుండి దీని ప్రాసాదంబునం జేసి కోరినవారికిఁ గోరినట్లు ధనంబిచ్చు చుండితిని. ఇప్పుడు మత్సర కారిణియగు ముదిమి సెరసెను. ఇచ్చోట భూమి స్వర్గంబుఁ జేర నిలిచి యున్నవాఁడ. నీవీ చర్మరత్న భస్త్రికం గైకొనుము. ఇది నను విడిచిన పిదప వణిజులకును వేశ్యలకును వలయు ధనంబుఁ బిత్తుకును. ఎవని యొద్దనుండియేని యన్యాయంబుగ ధనంబపహరింపం బడిన మఱల వానికీవలయు. న్యాయంబున గడింపఁబడిన దాని దేవ బ్రాహ్మణుల కొఱకీవలయు. అంత దీని శుద్ధిగలచోట నుంచి దేవతంబోలెఁ బూజించు చుండినఁ బ్రతి దినంబును రేపకడ సువర్ణ పూర్ణంబై కాన్పించును. ఇదియె కల్ప విధానంబు. నావుడు నే నంజలియొగ్గి నిలిచితిని.

అత్తపసి యాంచర్మభస్త్రిక నాకొసంగి యొకరాతి బోటియంజొచ్చె. నీ భస్త్రికను దేవర కెఱింగింపక యేనొద్ద నునిచికొని భరింపనోపక నీ సమ్ముఖంబునకుం గొనివచ్చితిని. ఇంక నీచిత్తంబుకొలందిం గావించునది. అన నీనుడిని వాఁడు విని నీయిచ్ఛకొలంది దీనిననుభవింపుమని ప్రీతుండై పలుకును. మరల నీవురాజుంజూచి దీనినొకండును బ్రముచ్చిలకుండు నట్లనుగ్రహింపుమని వేఁడుము. అతండట్లకానిమ్మని యియ్య కొనును. అంత నీవిక్కడకేతెంచి యేఁజెప్పిన ట్లర్థంబర్థిసార్థం బుగావించి ప్రతిదినము భస్త్రికం బూజించుచు పొంగిలిన యర్థంబులచే రేయి దాని నిండించి ప్రొద్దున జనులకుం జూపుము. దానం జేసి కుబేరదత్తుం డర్థపతిస్సరికుంగాన కర్థలోపంబునం గన్యకతోడ నిన్నుంజేయును. అర్థపతి దానికి సైపక వివాదంబువెట్టికొని యర్థగర్వంబున దూషించును. మనము నానావిధోపాయంబుల వానిం గౌపీనావశేషుం గావింతము. ఈయుపాయంబున మనముచ్చుఁదనము నొరుల కెఱుంగంబడక ప్రచ్ఛన్నంబై యుండగలము.

అని యానోడి వినవిని ధనమిత్రుండు సంతోషించినా చెప్పినట్ల కావించెను. ఆదినంబునన మన్నియోగంబునం జేసి విమర్దకుం డనువాఁ డర్థపతిం జేరి వాని కుదారకునందు వైరంబు పెంచె. ద్రవిణంబునం జేరాసగల కుబేరదత్తుండును తనకూఁతు నర్థపతి కొసంగుటమాని ధనమిత్రునకే యిచ్చెదనని నిశ్చయింప నర్థపతి ప్రతిబంధించెను.

ఈ దినంబులయందుఁ గామమంజరికిఁ జెలియలగు రాగమంజరి యను గణికపంచ వీరగోష్ఠంబున సంగీతకంబు గావించునని వీటి వారెల్లఁ బలుచనాదరంబున నేతెంచిరి. ఏనును మిత్రంబైన ధన మిత్రునితోడ నచటికరిగితిని. నర్తనంబు సలుపు నావృత్తస్తనికి నాచిత్తంబు రెండవ రంగ పీఠంబయ్యె. తదీయదృష్టి విలాసభాసురేందీవర మాలికలనాశ్రయించి మనోభవుండు భావరస సామగ్ర్యంబున నుత్పన్న బలుండయినను సుమనఃకలంబంబుల బిట్టుగలంచె. మఱియు నగరమోహపరోషితయైన పురదేవతయపోలె నవ్విలాసిని కటికల్పాతేకుల కప్పున నొప్పగు సవిభ్రమాపాంగదర్శన పాళికాశ్రృంఖలలచే నన్నుఁ గట్టివైచె.

తాండవానన్తరంబున సమృద్ధఫలలాభంబునశోభిలుచు నది విలాసంబుననో యభిలాషంబుననో యెఱుంగఁ జెలికత్తెల కైన నుపలక్షింపరాని క్రీఁగంటిచూడ్కిం బొమతీవె లోమూరంబుగ నటింప మాటిమాటికి నాపైఁ బరగించుచు నించుకపలుచాయ వెలువడ నవ్యాజంబుగ నగి చూపర చూడ్కులును మనంబులు వెంటనంటనింటికింబోయె. నేనును నాయింటికేతెంచి వారింపరాని యుత్కలికఁ గుడుపునందాస దిగనాడి తలయేరు నెపంబును బూని యొక తల్పంబున నొంటిఁ బవ్వళించి పొరలుచుంటిని.

అపుడు మదనతంత్రంబుల మిగుల సమర్థుండగు ధనమిత్రుండు నన్నుడగ్గఱి యోచెలికాఁడా నీ చిత్తంబునకుఁ

గోచరంబగుటచే నా వెలయాలు ధన్యురాలు. దానిభావ వృత్తి నేను దెల్లంబుగ నెఱింగితిని. చక్కరవింటివాఁ డాకలువకంటిని శరశయనంబునఁ బన్నుండఁ బెట్టగలఁడు. సదృశాభినివేశంబుగల మీకు జతనంబులేకయ పొందు సమకూరును. అయిన నొక విశేషంబుగలదు. ఆ వెలయాలు తన కొలముపాడి దిగనాడి తన కుంకువగుణంబె కాని ధనంబుగాదనియుఁ బాణిగ్రహణంబు లేక తన యావనము భోగ్యంబు గాఁగూడ దనియుఁ బ్రతినవట్టి యున్నది. తన యప్పయగు కామమంజరియుఁ దల్లియగు మాధవ సేనయుఁ బలుమారులు చెప్పినను వినక దృఢనిశ్చయమై యున్నయది. ఆ కామమంజరీ మాధవసేనలు రాగమంజరికిం గలిగిన స్వధర్మ వ్యతిక్రమంబునకుఁ గుంది రాజుకడ కేఁగి "దేవా యీదాసియగు రాగమంజరి రూపంబునకుం దగిన శీలశిల్ప కౌశలంబులచే మామనోరథములఁ బూరెంచునని యాసపడియుంటిమి. ఇప్పుడాయాస మొదలంటఁ జెగిమె. ఈ వెంగలికుల ధర్మంబువీడి యర్థంబపేక్షింపక తనప్రాయంబు గుణంబులకు విక్రయింపఁ దలచియున్నది. కులకాంతలరీతి ననుసరింపం బూనియున్నది. దానిశిక్షింప మేము వలంతులముగాము. దేవరయాజ్ఞనది ప్రకృతినొందు. దానమాకు లగ్గగు"నని ప్రార్థించిరి.

అప్పుడ ప్పుడమిఱేఁడు రాగమంజరి రావించి పలు తెఱంగుల బోధించినను నదివినదయ్యె. అట్టియెడ దాని

యక్కయుఁ దల్లియుఁ బెల్లువిలపించి జేనింగని యెవ్వఁడేని బాజుంగు మాసమ్మతి లేక యీబాలను వంచించి చెఱచెనేని వానిఁ దస్కరునింబోలె బంధించునదియని వేఁడికొనిరి. కావునరొక్కంబీక దానివారసమ్మతింపరు. అమ్మఁగువ రొక్కం బిచ్చువారిం గోరదు. దీనికిఁదగువెర వూహింపుము.

నావుడు నేను ధనమిత్రునింజూచి యిందుకై చింతింపఁ బనియేమి ? గుణంబులచే దానింగై వసంబు చేసికొని దాని స్వజనంబునకు దానికిం దెలియకుండ ధనంబొసంగి సంతోషింపఁజేసెదనని యంటిని. తరువాతఁ గామమంజరికి ముఖ్యదూతియగు ధర్మరక్షితయను జోగురాలి నన్నవస్త్రదానంబుల వశపఱచికొని దానితోనిట్లంటి.

"నీవు కామమంజరికడకేఁగి యీయూరనొక చతురుండగు దొంగగలఁడు. రాగమంజరిఁ దనకొసంగుదేని యుదారకునియొద్దనున్న యజన రత్నము ముచ్చిలి నీకుఁ దెచ్చి యిచ్చెదనని చెప్పి యున్నాఁడనుము. దానికది యిచ్చు నుత్తరంబు నాకెఱింగింపుము" నావుడు భిక్షుకి కామమంజరికీవార్తఁ దెలిపి తదంగీకారంబు నాకుఁ దెలిపె నేను దారకునొద్దనున్న చర్మరత్న భస్త్రికను దీసికొని కామమంజరికొసంగి నాగుణంబులకు మెచ్చి వలచిన రాగమంజరి కేలుఁ జివురుఁ గైకొంటిని.

ఏ రేయి చర్మరత్నంబును దొంగలెత్తికొని పోయిరను వాదంబుపుట్టె నాఁటిసంజకడ నొక పనినెపమున ముఖ్యులైన

కొందఱు నాగరికులనింటఁ జేర్చికొని యుంటిని. అప్పుడర్థపతింగపటంబునఁ గొలిచియున్న యాచారుండగు విమర్దకుండుఁ ధనమిత్రుని యొద్ద కేతెంచి పలుకాఱుంగుల బెదరించెను. అపుడు ధనమిత్రుండతనింజూచి పెఱవారి నిమిత్తముగ నేల గండ్రలుగఁ బలికెదవు? దీననీకుఁ బ్రయోజనం బేమి? ఎన్నండును నీకు నేనొక యపకారమొనర్పనైనను. దానికివాఁడు మరల బెదరించుచు నిట్లనియె.

తొలుత నోలికిఁ గొన్న పసనాలిని ద్రవ్యంబునఁ దన్నాతాపితల లోఁగొని స్వీయురాలిగాఁ జేసికొన నిశ్చయించితివి. ఇదియ నీకు రొక్కంబునఁ బుట్టిన పోతరంబు. నీకు నగ్గద్దియు నేఁగావింప నంటిని. ఇంతకంటె వేఱపరాధం బేమియున్నది. విమర్దకుండర్థపతి వెలిప్రాణంబను పుల్లరకుండెల్లంబు. ఏనువాని కొఱకుఁ దఱియొదవిన నుసురునేస్రుకువాఁడ. బ్రహ్మహత్యకేని శంకింపను, నీకొదవియున్న చర్మరత్నాహంకార దాహజ్వరంబునకు నాయొకరేయి మెలఁకువయె ప్రతీకారం బగును. అని యుద్ధతిఁ బలుకు విమర్దకు మాటలు విని యచటి పౌరముఖ్యులు గోపంబున వాని వారించి వెడల నడచిరి.

మఱునాఁడు రేపకడ ధనమిత్రుండు లేని నెగులంబూని తన చర్మరత్నంబు పోయెననియూరఁ జెప్పికొనుచు రాజున కెరింగించెను. ఎకిమీఁడును నర్థపతిని రహస్యంబుగఁ బిలిపించి నీయొద్ద విమర్దకుండను వాఁడు గలఁడా? యని యడుగ

నతండు మూఢుండుగావున దేవా నాకు విమర్దకుండను పరమ మిత్రంబుగలఁడు. వానివలన దేవరకుఁ గార్యంబెద్ది యనెను. అందుకు రాజు వానింజూచి వాని నిచ్చటకుఁ బిలిపింపఁగలవె? నావుడు నతండు పిలిపించెదనని చెప్పి యచ్చటనుండి వెడలి తనయింటను, వేశావాటంబునను, జూదపుటిండ్ల, నంగళులఁ జక్కవెదకి వానిం గానఁడయ్యె. నేనంతకుమున్న విమర్దకునికి నీచిన్నెలు దెలిపి నిన్నన్వేషింప నుజ్జయినికిం బంపితిఁ గావున నర్థపతివానింగనఁడయ్యె. ఇట్లతండు వానింగానక యవివేకంబు వలననో భయంబుననో విమర్దకుండు గావించిన యపరాధంబు నకు నేబూటఁగానని పలికె. ఆ మాటవిని ధనమిత్రుండు రాజుంజూచి విమర్దకుండు చర్మరత్నంబు వీనికిఁగా దొంగిలెనని నిరూపించె. రాజది నిక్కంబని నమ్మి యర్థపతిని నిగడితుం జేసి కారం బ్రోపించె

ఈ దివసంబులయందు కామమంజరి విఘ్నకల్పంబునఁ జర్మరత్నంబుఁ బినుకనిచ్చగించి మొదల శిక్షకిన ధనమును మున్నుతనచేతనపహృతసర్వస్వుండై క్షపణక రూపంబుననున్న విరూపకునకొసంగి నమ్మఁబలికి మిగుల ననునయించి యింటి కే తెంచెను. విరూపకుండు నొకవైపున క్షపణకనిష్ఠాపిశాచం బువలనం దొలంగి నాచే శిక్షితుండై మరల స్వధర్మంబు నొందెను. కామమంజరియు నజినరత్నంబు దనకువలయు ధనంబుఁ బినుకువనువచ్చికచే నింటనున్న ప్రాయ్యఁదక్క మిగిలిన ధనంబెల్ల నర్థులకుంబుడికె.

అంతనాపంపున ధనమిత్రుండు రాజుకడ కేఁగి దేవా యీ వీటనుండు కామమంజరి యను బోగముది లోభాధిక్యం బున లోభమంజరియని లోకంబున నిందపాలయ్యె నిప్పుడట్టిది యింటనున్న ఱోళ్ళు రోఁకండ్లు మొదలగువాని సైతము నిరపేక్షంబుగ నొడ్లకిచ్చుచున్నయది. నా చర్మరత్నంబు దీనికి లభించెఁగాఁబోలుఁ గాకున్న నిట్లేలచేయు, వణిజుల కేని వారముఖ్యులకేని చర్మరత్నంబు పిదుకునను ప్రతీతి కలదు గావున నామిందటయందు సందియంబు వొడమెడునని విన్నవించిన నాతేఁడుచయ్యనఁ గామమంజరిని వాని జనని తోడఁదోడ్తెమ్మని భటుని బంపెను

అప్పుడేను గామమంజరిఁజూచి యుపహ్వరంబున దీనవచనంబుల నిట్లంటిని. ఓయార్యురాలా నీవు నీకున్న ధనంబెల్లఁబ్రకాశంబుగనితరుల కొసంగుటం జేసి చర్మరత్నంబు నీకులబ్ధంబయ్యెనని యొడ్లకుశంకింపవలసివచ్చె. దీనినడుగు టకై నృపతినినుఁబిల్వఁబంచె. నీవుమాటిమాటికి నిర్బంధింపం బడి చర్మరత్నపు దొంగతనంబు నాయందుఁ జెప్పక మానవు. అది కారణంబుగఁ జిత్రవధ గాఁగలదు. ఏనుమేనురివిస నీచెల్లెలు ప్రాణంబులబొంది నిలుపంజాలదు. నీవును పేదరాల వైతివి. చర్మరత్నంబు ధనమిత్రునిఁ జేసను. కావునని యాపద యెల్లప్రకారంబుల ననర్థంబులతోఁ జేసియున్నది. దీనికిఁ బ్రతీకారంబేమి? అనవుడు కామమంజరియు మాధవసేనయు గనులనస్రంబులుజాఱననుంజూచి యయ్యానూమకాష్ఠ్యంబునన

రహస్యంబు బయల్పడినట్లున్నది. రెండుమూఁడు మాటలు చెప్పకడాఁచినను మఱల రాజుకావించు నిర్బంధంబున నీయందు దొంగతనంబుఁ జెప్పవలసివచ్చును. నీకు నావ్యప దేశంబుగలుగ మాకుటుంబమెల్ల మునుంగును. ఇపుడర్థపతి యందు నీయపయశం బారోపింపబడియున్నది. వానికిని మాకును బొందుగలిగియుంట నీయూరనెల్లరకు విదితంబు. కానఁ జర్మరత్నంబర్థపతియ మాకిచ్చెనని తప్పువానియందుఁ బెట్టి యాత్మరక్షణంబుఁ జేసికొందమనిరి. దానికే సమ్మ తించితి.

వారికువ్వుడను రాజకులంబునకుఁజని రాజుచే నను యుక్తులై యయ్యా, యిచ్చినవాని పేర్వెలిపఱుచుట వెలయాండ్రకు ధర్మవుగాదు. న్యాయార్జితంబులైన ధనంబు లనకొని పురుషులు వేశ్యలంజేరరని సారెకుఁ బ్రచ్ఛాదనంబు గావించి ముకుసెవులు గోయింతునని తర్జించుటచే భయంపడి చర్మరత్నంబర్థపతి మాకొసంగెనని చెప్పిరి. అంత నేలిక కుపితుండై యర్థపతిని బ్రాణాంతిక దండంబునకు భాజనంబు చేయఁజూచుతఱి ధనమిత్రుండు ప్రాంజలియై దేవాయిట్టి యపరాధంబుల వధ్యులుగాకుండునట్లు వణిజులకుఁదొల్లి మాన్యుండు వరంబిచ్చియున్నవాఁడు. నీవు వీనిదెస నలుక గలవేని యీపాపిష్ఠుని సర్వస్వంబును దండుగగాఁబుచ్చికొని యూరువెడల నడువుమనియె.

ఈమాటవిని యచ్చట నున్నవారెల్ల ధనమిత్రుని దగ్గయుఁగీర్తించిరి. నృపతియుఁబ్రీతుండై యర్థమత్తుండగు నర్థపతిని బౌరసమక్షంబున జీర్ణవస్త్ర శేషుఁగావించి వెడలఁ గొట్టించె. మఱియుఁ జర్మరత్నంబు తనకు రొక్కంబు పితుకునను రిత్తమోసం జేసి తనసొమ్మెల్లం గోల్పోయిన కామమంజరికి ధనమిత్రుండు సదయుండై యర్థపతి ధనంబులోఁ గొంతభాగంబు రాజుచేనిప్పించి తానుశుభముహూర్తంబునఁ గుబేరదత్త పుత్రికయైన కులపాలికం బెండిలియయ్యె. ఈరీతి సిద్ధ సంకల్పుఁడనై రాగమంజరి యుక్కనెక్కుడు రతనంబుల చేతను బైఁడిచేతను నించితి.

ఈ పురంబుననున్న లుబ్ధులగు ధనికులందఱు నాచే ముషిత సర్వస్వులై మేనోసంగిన తదీయధనంబుల సమృద్ధులై యున్న యర్థులయిండ్లకు బికిరంబుకొఱకుఁ బోవసాగిరి. ఎంతటివలంతియైని దయ్యంబు నుదుటవ్రాసిన యక్కరంబులఁ బోఁదుడువ సమర్థుండుగాఁడు. ఎట్లనిన నేనొకతఱిఁ బ్రణయకుపితయైన రాగమంజరి ననునయించి మద్యంబుత్రావించి యాబిడ ప్రేమంబున నొసంగిన గండూష మద్యంబు పలుమాఱు నాస్వాదించి మత్తుగొంటిని. మత్తిల్లిన వానికిని వేదురువట్టిన వానికి నమార్గంబుచేనైన కర్మంబులయందు ప్రవర్తించుట స్వభావంబు. కావున మదిఁబాదుకొన్న మదంబున నేను గామ మంజరింజూచి యీరాత్రిరిన యీవీడెల్లనిర్ధనంబు గావించి నీయిల్లునించెద నంటిని.

దానికట్టోటి మదిఁగుంది యిట్లుచేయవలదని మ్రొక్కు లిడియు దోసిల్లొగ్గియుఁ బలువిధంబుల నోట్లువెట్టియు నెంత వేఁడికొన్న న్వినక గళితశృంఖలంబైన గంధసింధురంబుం బోలె నేచి శృంగాలిక యనుదాది వెనుకొనిరాఁ బెక్కుపరికరంబులు లేక కత్తియతోడుగా నతివేగంబున నచ్చోటనుండి వెడలి యెదుర వచ్చునాగరిక జనంబు మూఁక సరకుఁగొనక చొచ్చితిని. వారునన్ను వీఁడెవాఁడయని పట్టుకొని బిట్టు గొట్టిరి. ఏనంమలకు మిగులఁగోపింపక యుండు వానివలె మదశిథిలంబైన చేతనున్న చంద్రహాసంబున నిద్దఱమువ్వుర నటికి యెట్టనికనులు తిద్దిరందిరుగఁ గ్రిందఁబడితిని. అంత శృంగాలిక యతిదీనంబుగ నేడ్చుచున్నను డగ్గఱె పగతురు నన్నుబంధించిరి. ఆపద నాదుమత్తును గొంచె మడంచెను.

అంత నేనెఱుకఁదెచ్చుకొని యోహో యజ్ఞానంబున నింతటిబెడఁదకుఁ బాత్రంబనైతి. ధనమిత్రుండు నాచెలి యగుటయు రాగమంజరి నే గ్రహించుటయు నెల్లరకుఁ దెలిసినయదియ. నాకతంబున వారిరువురును దప్పుగలవారై రేప నిగ్రహింపఁబడుదురు. వారిరక్షించు తెరు వెద్ది ? నాకును నీయనర్థంబు తొలంగుటెట్లొకో యని చింతించి మదినొకవెరవూహించి శృంగాలికంజూచి ముసలిదానా నీవు నాయొద్దకు రావలదు. పామ్మర్థంబునఁ బేరాసగల రాగమంజరి నజితగత్నంబునఁ బోతరించి నాకు మిత్ర చ్ఛద్మంబుననున్న ధనమిత్రునితోఁ గూర్చితి వాపాపుని చర్మ

రత్నంబును నీకూఁతు తోడవులను గ్రుచ్చిలించుటవలన నే నిపుడు నిశ్శంకంబుగ నుసురుజ్జగించెద ననిపలుక నది యాశ యంబెఱింగి కృతాంజలియై యచ్చటి పురుషులకుం బ్రణమిల్లి డగ్గుత్తికతో సాంత్వనపూర్వకంబుగ నిట్లనియె.

అయ్యలారా, కొంతతడవు మిన్నకుండుఁడు. వీనివలన ముషితంబైన మాధనంబంతయు నెఱింగెద. పిమ్మట మీకుం బోలిన యట్లుకావించునది. అనినవారట్ల కానిమ్మనిరి. శృంగాలిక నన్నుఁజేరి యో సౌమ్యుఁడా, యీ దాసి గావించిన యొక యెగ్గున్నుసైఁపుము. నీ కళత్రంబు నంటిన ధనమిత్రుండు వైరాస్పదంబౌఁగాక. తడవునుండి కావించిన పరిచర్యఁ దలంచి రాగమంజరి ననుగ్రహింపం బోలదొకో వెలయాండ్రకుఁ దొడవులు తొడుగుటయె సారంబుగావున దాని భూషణంబెచట దాఁచితివి చెప్పుమని నాయంజలం బట్టెను. నేను దయచేయు వానివలె దానింజూచి కానిమ్ము. మిత్రిచేతికిం జిక్కిన నాకు రాగమంజరితోఁ బగఁగొన నేమి పనియని సౌమ్యున్నచోటుఁ జెప్పువానివలె దానిచెవిపొంత మెల్లమెల్లఁ గర్తవ్యం బుపదేశించితిని.

అంత నదితదర్థంబెల్ల నెఱింగి యో తండ్రీపెద్దకాలంబు నాయాయుస్సుసయితము పోసికొని బ్రతుకుము. నీయులు వేల్పులునీదెసఁబ్రసన్నులగుదురుగాత. అంగరాజునునీదుపౌరుషంబునకుసంతసించి నినువిడుపించుఁగాత. ఇచటనున్నవీరెల్ల నీదెసఁ గనికరింతురుగాక యనియాశీర్వదించి తొలఁగిచనియె.

తరువాత నాకెకులచే నైకిమీాని యూనతినేను చెఱసాల నొందింపఁబడితిని.

అంతమఱునాఁడా పట్టణముననుండువాఁడును సుభగమానియునొరపరిననిపోతరించినవాఁడును నల్పకాలంబునన తండ్రిచచ్చుటచేఁ బ్రాప్తాధికారుండును బ్రాయముపోగనున యుక్తాయుక్తము తెలియంగనివాఁడును నగుకాంతకుండను నొకండు నాచెంతకేతెంచి కొంచెముబెదరించి యోకీధన మిత్రునియజినరత్నంబు మఱలనిమ్ము మఱియువీటనున్నవారి యర్థంబెల్ల దోఁచికొంటివి. దానినిబదపకి యొసంగుము. అట్లు కావింపనినాఁడెల్లయిడుమలకు లోనయ్యెదు. కడపటమిత్తి వాతంబడియెదవనెను. దానికేనుమోనమునఁ జిఱునవ్వొలయ నిట్లంటిని. ఓసౌమ్యుఁడా యేనుబుట్టిననాఁటనుండి దొంగిలిన సొమ్మంతయు వారివారికిచ్చివనిత్తుంగాక. అర్థపతి పెండ్లము నపహరించి నాకుమిత్రాపదేశంబున శత్రుండైనధనమిత్రునికిఁ జర్మరత్నంబుదెసఁగలిగిన కోర్కెకొనసాగింపకుండువాఁడ. దీనివలన గొడతెన్నెనిరానిమ్ము. వానింగుఱిచెద. ఇదియనా ప్రతినయంటి. వాఁడును గ్రమంబుగ నన్నుఁ జేయుచుఁ బ్రతిదినంబును సాంత్వనతర్జనంబుల నన్నడుగుచుండె. నే నను గుణంబైన యన్నపానంబు లొదవుటంజేసి కొన్నిదినంబులకు విరోపితవ్రణుండనై తొల్లింటియట్ల పుష్టినొందియుంటి.

---

రివైజ్డు S. S. L. C. సిలబసుననుసరించి విద్యార్థులచే వ్రాయబడి మాచే ప్రచురింపబడిన కొన్ని క్రొత్త ప్రచురణములు.

## బ్రిటిష్ చరిత్ర - British History

వెంపటి రామయ్యపంతులుగారు, బి.ఏ., ఎల్.టి.,
హెడ్మాస్టరు, హిందూకాలేజి హైస్కూలు, బందరు.

ప్రథమభాగము—4 వ ఫారమునకు (Pre-Tudor Period) 0—10—0

ద్వితీయభాగము—5 వ ఫారమునకు (Tudor and Stuart Periods) 0—10—0

తృతీయభాగము—6 వ ఫారమునకు (The Hanoverian Period) 0— 8—0

## హిందూదేశ చరిత్ర - Indian History

విన్నకోట వెంకటరంగారావు పంతులుగారు, బి.ఎ.,ఎల్.టి.,
హెడ్మాస్టరు. బోర్డుహైస్కూలు, గుడివాడ.

1 వ భాగము—4 వ ఫారమునకు ... 0—8—0

2 వ భాగము—5 వ ఫారమునకు ... 0—8—0

3 వ భాగము—6 వ ఫారమునకు ... 0—8—0

## ప్రపంచ భూగోళము

డి. కోదండరామస్వామి పంతులు, బి.ఎ., ఎల్. టి.,
కె. వెంకటార్రావు పంతులు, బి. ఏ., ఎల్. టి., గార్లచే.

1 వ భాగము—4 వ ఫారమునకు ... 0—10—0

2 వ భాగము—5, 6 ఫారములకు ... 0—12—0

## ఆంధ్ర వ్యాకరణము

పండిత పెన్మెత్స సత్యనారాయణరాజుగారు.

4, 5, 6 ఫారముల విద్యార్థులకు 0—8—0

**వేంకటరామ్ అండ్ కో.,** హెడ్డాఫీసు:—ఏలూరు.